

ఆదోనిలో హిందీ ప్రచారక మండలి జరుపబడినప్పటి ఛాయా చిత్రం — ఇందు భారత ప్రభుత్వ గృహ మంత్రి గా. బి. యన్. దాతార్, హిందీ ప్రేమీమండలి కార్యవర్గ సభ్యులు, ప్రచారకులు, విద్యార్థి విద్యార్థినులు గలరు.

ఫోన్: 32066 టెలిగ్రామ్: హిందీసంఘ్
సంపుటి 8 సంచిక 10

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక



సంవత్సర చందా
రు. 4-00

జనవరి
1962

విడిప్రతి
35 నయాపైసలు

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.

## ఈ సంచికలో

కవిత:

# పైడిపాటి పంచశతి

—శ్రీ సుబ్బారామశాస్త్రి

పూవు నైనను మఱి పూవుబోడి నైన
కంటగించుట లేదు జగమ్ము నందు
కంటకావృతసుమమైన, కంటగించు
తొయ్యలిని నైన గారవింతురు జనమ్ము.

తరుణి పుష్పేషు దర్పమ్ముఁ దట్టుకొనగ
'నర్భకుడు' భక్త గోక్షీర మారగించె;
రమణి యంతటఁ బోక పలాండు దినియె
తెలియ నిందునఁ దక్కువఁ దినిన దెవరు?

మంచి గంధంబుఁ బూసెను మల్లె ముడిచె
పగలె మనసయి గిరివాటు మగనిఁ జేరె
ఇంత కంతట మాట పట్టింపు రాగ
తుంట విలుకాని విలుఁ జొప్పదంటుఁ జేసె.

నన్నుఁ జూచె నతండు నన్నుఁ జూచె నటంచు
నబ్జముఖులు పంతమాడు కొనుచు
యువకు నొకని డాసి, యొత్తి చెప్పు మటన్న
నతడు, రెండు కనుల నప్పళించె

పలుకు నగవునఁ జూపు రూపమునఁ జేష్ట
నింతి! యొక పద్యమైన నాకీయ లేవు
అగును! మగవాడె నిన్నుఁ బెండ్లాడినాడు
స్త్రీ యటంచును స్రష్ట సృష్టించినాడు.



వ్యాసము :

# తెనుగులో తొలి చిత కవిత

-శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

'ఆంధ్ర కవిత్వములో చిత్ర బంధాధి కవిత్వముల పుట్టు పూర్వోత్తరముల నరయుదము.'

—ఆంధ్ర ప్రదేశ్ అకాడమీ బహుమతి పొందినది - నన్నెచోడుని కవిత్వము.

తెనుగులో చిత్ర కవిత క్రీ.శ. 15వ శతాబ్దము నాటిదని ప్రియ మిత్రులు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు పేర్కొన్నారు. కాని, క్రీ.శ. 7వ శతాబ్దము నుండి దేశి చిత్ర కవిత కనబడుచున్నది.

క్రింది విమర్శ నిక్కడ చేర్చుట ప్రకరణోచితము.

'పుణ్య కుమారుని మాలెపాడు శాసనమున రగడయు———' గానిపించుచున్నవని కొందఱు పరిశోధకులు వ్రాసి యున్నారు. *

—(87 పు.)

'క్రీ.శ. ౯వ శతాబ్దము నడిమి భాగము నుండియు రేనాటి చోళులును, తూర్పు చాళుక్యులును వ్రాయించిన తెలుఁగు శాసనములు కానవచ్చుచున్నవి.

—(367 పు.)

'నన్నయ కాని నన్నిచోడుఁడు కాని రగడ వాడియుండు లేదు. ఉపలబ్ధమైన యాంధ్ర ఛందో గ్రంథములలో మొదటిదైన కవిజనాశ్రయములోన రగడలు పేర్కొనఁబడలేదు.

—(320 పు.)

* శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు పరిశోధన పత్రిక.

'పుణ్యకుమారుని పొట్లదుర్తి మాలెపాడు శాసనములో ద్విరదగతి రగడ నిబద్ధమై యున్నదని వ్రాసియున్నారు.

ఇందిరువదేసి మాత్రలున్న మాట నిజమే కాని, యైదేసి మాత్రలకు గణములు విరుగుటలేదు. (ఇచ్చిన పన్నస). గణములు తాళానుగుణము లుగా పంచలఘు గణములతో లేవని వారే వ్రాసియున్నారు. ఇట్లు విరుగ కుండుట సాంప్రదాయమునకు విరుద్ధము. యతులు సమస్థానము లందున్న వని వారు వ్రాసియుండిరి. నిజమున కవి సమస్థానములలో లేవు.

మొదటి పాదమున 15 మాత్రల తరువాతను రెండవ పాదమున 13 మాత్రల తరువాతను యతి వేయఁబడినది. లక్షణమునసనుసరించి మూడవ గణము మొదట యతి యుండవలెను.

ఇందాద్యంత ప్రాసలు లేవు.

ఈ విధముగా నిందొక్క మాత్రానియమము తప్ప మఱే ద్విరదగతి రగడ లక్షణమును గానవచ్చుటలేదు. కేవల మాత్రల లెక్కను బట్టియే చూచినచో మనము వ్రాయు ప్రతి వచన భాగమునందు నేదో యొక పాదమును జూఁపవచ్చును. అందుచే నిది ద్విరదగతి రగడయని చెప్పుట యుక్తము కాదు. ఐదేసి మాత్రలకు గణము విరుగ కుండుటచే నిది వృత్త గ్రంథియనియైనఁ జెప్పుట కవకాశము లేదు.

—(౪౯౫ పు.) *

ప్రారంభ దేశి తెనుగు కవిత కీ యతి ప్రాసల సంకెళ్ళు తగిలించు విమర్శ పనికి రాదు, వేంకటేశ్వర వచనముల వంటి పాటలు పాడు తెనుగు జాతికి ఛందో నిర్బంధములు మొదట లేవు.

రగడలో గణముల కూ ర్పెట్లున్నదో శ్రీ అవధానిగారు గుర్తింప లేదు.

— * ప్రాఙ్నన్నయ యుగము డాక్టరు. దివాకర్ల వేంకటావ ధాని గారు.

మూలము :-

అణపో, తులురే, వణకాలు,
—పుద్దణ, కాలు;
ఇచ్చిన, పన్నస, పెన్నారే,
-ఇశేరేనికిన్.

ఛాయ—
అన పోతులు రేవనగారు
—పెద్దనగారు;
ఇచ్చిన పన్నస పెన్నారె

మాత్రా గణములు—

| | |
|---|---|
| 4 + 4 + 5/—/ + 4 + 3 | 20; |
| 4 + 4 + 5/—/ + 4 + 3 | 20. |
| | 40 |

పై ద్విరదగతి రగడలో తాళానుగుణముగా పంచలఘు గణములు లేకపోయినను, భిన్న సంఖ్యా గణములో ద్విరదములలో సమ రూపములుగా ఉన్న వనుట వచన లక్షణము కాదుగద!

లక్షణము ననుసరించి మూడవగణము మొదట కాక, పిమ్మట యతి యుండవలెననుట కి ద్విరదగతి రెండవపాదము (ఇచ్చి॥ ఇశే) యతి లక్ష్యమగుచున్నది. ఇది దేశియతి—వడి ప్రారంభదశగా భావించుట కవకాశము లేకపోలేదు. కాని, మొదటి పాదములో దేశివడి చెల్లకపోయినను, మార్గయతి-విశ్రాంతి చెల్లినదనుట వైకల్పికము, దండకములో గణముల కూర్పున్నను యతులు చెల్లనక్కర లేదుకద! అణ-పు-దణవంటి ప్రాస చెల్లుట దోషము గాదు.

ఇట్టిది 'మునుమార్గ కవితలోకంబున వెలయఁగ దేశి కవితఁ బుట్టించి తెనుంగును నిలిపిరి.' అనుమార్గ— దేశి మిశ్రమ జాతి రగడగా కనబడు చున్నది. కొలది మార్పుతో ప్రాసయతిని సాధించ వీలిచ్చుచున్నది.

అన పోతులు లేవనగా [ర్పె]
—ద్దనగారు
ఇచ్చిన పన్నస పెన్నారె
సిఖరేనికిన్.

ఇప్పుడీ జంపెగర్భిత ద్విరదగతి రగడలో యతిభంగ దోషము లేదు. 'జంపె రేకునకు లక్షణము ద్విరదగతి యగుఁగాన నొకలఘు వందు మాన(న్). (లక్షణ సా.), ప్రాచీన రగడలో అంతము లోగాక, మధ్యలో ఎక్కడనైనను ఒక లఘువు లోపించుట జంపెరేకు లక్షణముగా కనబడుచున్నది.

కోరుమిల్లి శాసన మందలి సంస్కృత రగడలో 'దారాకరేణాగ్ర-హారీకృతః కోరు— ప్రాసయతియు, అఖండయతియు కూర్పబడియున్నవి. కావున, నన్నయకాని, నన్నిచోడుఁడు కాని రగడ వాడియుండ లేదనుట సమకాలిక లక్షణము కాదు.

చంపక మాలావృత్తమున ఎత్తుగతి, ద్విరదగతి, జంపె, ఖడ్గబంధ గర్భ కవితము—కుమార సంభవ కథలో 1054 కథేతర కాలముగా ది. 15-3-1054 జయ చైత్ర సంపదను-వ్రాసియున్నను, నన్నిచోడ కవి చరిత్రాదులలో వివరించినను నన్నిచోడకవి రాజు రగడ వాడలేదనుట వాదపటిమ కాజాలదు.

క్రీ.శ. 7 శతాబ్ది రేనాటి చోడుల గద్య శాసనములలో రగడలు చిత్ర కవితలో కనబడుచున్నను, లేవనుట నిదర్శన భాషావాద చరిత్ర కాదుకద!



కవిత :

# అశ్రుధార

-శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి

నన్ను పాలింపకుండ నయనముల నెండ
నశ్రువులు నింపుకొనె కనుంత, నశ్రుధార
లొలికి వెలయేఱులై పాఱుచున్నఁ గాని
నేను జీవలవమ్ముతో నిలువలేను

కనుల బాష్పాలు చిందించు కొనెడి నన్నుఁ
జూచి యసమర్థుడు వివేకహీనుఁ, డనుచుఁ
బరిగణించినఁ బరిగణింపంగ వచ్చుఁ
గాని యది మీదు దుర్వివేకమునె తెల్పు

గుండె మీద బొక్కుచుండు బొబ్బ పగిలి
నీరు కనుల నుండి నిర్గమించు
బొబ్బ వగిలి నీరు పోవ కట్టులె యున్నఁ
గుండె కూలి పోదె?

హృదయ గోళమ్ములో పొచ్చిరిల్లుచుండు
బరువు బాష్పరూపమ్మున బయటపడుచు
తగ్గు నొకయింత — యటువొంత తగ్గకున్న
ఈ హృదయగోళ మెట్లు భరింపఁ గలను?

తత్త్వమెఱిఁగిన వస్తుశాస్త్ర ప్రవీణు
నొక్కరుని బిల్చి నాకంట నురలుచున్న
అశ్రుకణములఁ బరికింపు మనుఁ, డతండు
స్పష్ట మొనరింపఁ గలఁడు తచ్చరిత మెల్ల

హిమకణమ్ములో మంచి ముత్యములో గడ్డ
గట్టిన వినిర్మలజ్యోత్స్నికలో యటంచు
వర్ణనము సేయువారు బాష్పముల రూప
రేఖ లెన్నఁడు సరిగ దర్శింప లేరు

కన్నులర మోడ్చి కందురే కాని కనులు
చక్కగా విప్పి కనరేమి ? యొక్కసారి
చూపు నిలఁబెట్టి నావంకఁ జూడుఁడయ్య !
నిలువున ద్రవించి నీరు గాఁగలరు మీరు.

కొండ ఱాల వంటి గుండె లైనను గాని
కంటి నీటి కిట్టె కరఁగి పోవు
ఎడద నుండి బయటపడు బాష్ప సలిల ప్ర
భావ మెడఁద నెట్లు వడక యుండు ?

మానసమ్మునఁ బేరిన మలినములను
గడిగి వెలికి వచ్చెడి నీరు కంటి నీరు
ఆంతరిక కల్మషమ్ముల నరసి చూచి
క్షాళనము చేసికొన రెంత ఘనులో కాని.

ఒక్క బొబ్బయైనను బొక్కకుండవచ్చు
నుత్కటంబైన బరు వెక్కకుండవచ్చుఁ

గాని యంతయో యింతయో కల్మషమ్ము
కూడుకొనఁ బోని హృదయముల్ గూడఁ గలవె?

ఎన్నఁడును గంటఁ దడిపెట్టి యెఱుఁగరన్న
నసలు గుండెలె లేకుండనైన నుండు
మానవత్వము సర్వమ్ము మంటఁ గలసి
దానవత్వమ్ము పైకొనియైన నుండు.

అంతియే కాని ధీరుల మమలమతుల
మశ్రువులు నింప మాకేమి యవసరమ్ము?
నిబ్బరము లేని బేలలే నింతురనుట
ఆత్మవంచకు లవి చారు లాడు మాట.

కదలి కరఁగని గుండియల్ గలుగనేల!
ముక్కలై చక్కలై ప్రీలిపోవ మేలు
నీరు లురలని నేత్రముల్ నిలువ నేల?
మూల హీతమ్ములై రాలిపోవ మేలు.

ఎవ్వ రేమన్నఁ గాని నా కేమి? యిల్లె
గుండెలో నూట లెత్తించుకొనుచు నుందు
కనులలో నశ్రువులు నింపుకొనుచు నుందు
మానుకోఁబోను మానుకోలేను నేను.

స్వామి సన్నిధి నాదు దోషములు దెల్పి
మన్ననము వేఁడుకొన నోట మాట రాదు.
ధారలై యేఱులై కంటినీరు పొరల
మ్రోల నిల్చుండెదను మౌనముద్ర దాల్చి.

# వి వా హ వి ధి

-శ్రీ త్రిపురనేని సుబ్బారావు

కవిరాజు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారు చిన్ననాటినుండీ తాను విశ్వసించిన అభిప్రాయాలను నిర్భయంగానూ నిరాఘాటంగానూ వెల్లడించేవారు. మానవజీవితంలో వివాహంమహోత్కృష్టమైనది. గనుక వివాహ నిర్వహణవిధానంలో వారికిగలకొన్ని అమూల్యమైన అభిప్రాయాలను లోకానికి తెలయజేయాలనే ఉద్దేశంతో "వివాహవిధి"అనే చిన్నపుస్తకాన్ని ప్రచురించారు. దీనినిగురించి తెలిసికొనే ముందు వివాహంయొక్క పుట్టుపూర్వోత్తరాలను కొంతవరకు తెలియజేయడం అసందర్భం కాదనుకొంటాను.



కీ.శే. కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి

ఈనాడు కొందరనుకొంటున్నట్లుగా 'వివాహం' మానవజాతి ఏర్పడినప్పటినుండీ ఉన్నదనుకోవడం పొరపాటు. అసలు మానవజాతి ఏర్పడటానికే, కొన్ని లక్షల సంవత్సరాలు పట్టింది. కోతులు—ఆ తరువాత, అర్ధవానరజాతులు, ఆమీదట, అర్ధనరజాతులు, ఆపైన ఈ క్రమంలో మానవజాతి వికసిస్తూవచ్చింది. ఈ వికాసమనేది 'జీవ' గుణాలలో ఒకటి. ఆహారం సంపాదించుకోవటం, తన జాతిని విస్తరింప జేసుకోవటం- ఇవి మూడూ ప్రతి ప్రాణిలో

వుండే కనీస లక్షణాలు. కాలం, ఈ లక్షణాలమీద అనేక ప్రభావాలను కలిగించింది. రకరకాల వాతావరణాలు, జీవులను మార్చివేశాయి. ఇది కారణంగానే మానవుడనేవాడు, భూమిమీద అవతరించడానికి అవకాశం కలిగింది.

తనజాతిని విస్తరింప జేసుకోవటానికి, ప్రకృతి— స్త్రీ, పురుష విభాగ మంటూ చేసింది. మనకు తెలిసినంతవరకూ, ప్రతిసృష్టికి, విభిన్న తరగతులకు చెందిన ఈ రెండు ప్రకృతులూ అవసరమే! జీవశాస్త్రం చదివినవారికి ఇందులో విడ్డూరమేమీ కనిపించదు.

అనాది యుగంలో వివాహమంటూ ఉన్నదనడానికి ఆధారాలులేవు. స్త్రీలు, పురుషులు యథేచ్ఛగా కలుసుకొంటూ వుండేవారు. సంతానాన్ని కంటూవుండేవారు. ప్రపంచ మంతటా—కొద్దివందల సంవత్సరాల తేడాతో, ఆదిమ మానవులు అవతరించారు ఆయా వాతావరణాలను బట్టి, వారి ఆహార విధానం, వాడే ఆయుధాలు ఉంటూవుండేవి., ఉదాహరణకు చూద్దాం:- ఉష్ణమండల ప్రాంతంలో అవతరించిన ఆదిమ మానవజాతి, వస్త్ర ధారణకు, అంతగా ప్రాముఖ్యం ఇచ్చినట్టు కనపడదు. వీరు, కొంత బల హీనులుగా కూడా వుండేవారు. హిమ ప్రాంతీయులు, ఆహార సంపాదన లోనూ, ఆత్మరక్షణలోనూ, వేటలోనూ. బాగా ఆరి తేరారు. వారు బల శాలురు కూడాను. ఒక్కొక్కసారి హిమప్రాంత మానవ తండాలు. ఆహారం కోసం, చలినుండి కాపాడుకోవడం కోసమూ, యోజనాల పర్యంతం ఉష్ణ మండల ప్రాంతాల వైపు ప్రయాణాలు సాగించారు ఈ ప్రయాణాలలో ప్రకృతి వారిని నిర్దాక్షిణ్యంగా సంహరించింది. ఇతర మానవ తండాలు, కొత్తగా వచ్చినవారితో హోరాహోరీగా పోరాటాలు సాగించాయి. అపారమైన జననష్టం సంభవించేది. ఆనాడు, ఈనాడూకూడా, బలం వున్న వాడిదే గెలుపు. ఆ రోజుల్లో బలానికి మరింత ప్రాముఖ్యత ఉండేది. ఈ బలం, సంఖ్యమీదా, వాడేఆయుధాలమీద ఆధారపడి ఉండేది. తమ తండా

లలోని సంఖ్య, దిన దిన ప్రవర్ధమానమైతేనే, బలంగా వుంటేనే ఆ తండా నిలబడ గలిగేది; లేకపోతే, నామరూపాలు లేకుండా నశించిపోయేది. అలా నశించిపోయిన జాతులు చాలా ఉన్నాయని మానుష శాస్త్రజ్ఞు లంటున్నారు.

చెప్పవచ్చిందేమిటంటే—ఉత్పత్తికి నిబంధనలంటూ ఏర్పడితే, అది కుంటుపడుతుందని, ఆనాటి మనిషికి తెలుసు. అందుచేతనే, అతను స్త్రీ, పురుష సంబంధాలకు నియమాలూ, నిబంధనలూ ఏర్పాటు చేసుకోలేదు. తండాలు పెరగడమే ప్రధానం.

రాను, రాను, మానవజాతిలోని ఈ కల్లోలాలు సమసిపోయాయి. జాతులమధ్య వైషమ్యమూ, యుద్ధాలూ కొంతవఱకు చల్లారాయి. ఆ దశలోనే, ఈ సంబంధాలకు, కొన్ని నియమాలూ ఏర్పడ్డాయి.

ప్రథమంలో—అన్ని జాతులలోనూ "మాతృస్వామిక వ్యవస్థలు" అమల్లో ఉండేవి. పురుషుడు, శారీరకంగానూ, మానసికంగానూ, బలవంతుడు కావడంవల్ల, స్త్రీ నుండి అధికారాన్ని గుంజుకొన్నాడు. అప్పటినుండీ "పితృస్వామిక వ్యవస్థలు" అమల్లోకి వచ్చాయి. మాతృస్వామిక వ్యవస్థ తాలుకు చిహ్నాలు, ఇప్పటికీ కొన్ని జాతులలో కనపడతాయి. గోండులు, గదబలు, సుగాలీలు, మాతృస్వామిక వ్యవస్థనే అంటిపెట్టుకొని ఉన్నారు. మలబారులో ఇప్పటికీ ఆ లక్షణాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి.

సాంఘికంగా పురుషుడు పెత్తనానికి రావడంతోనే, స్త్రీ, పురుష సంబంధాలలో ఎన్నో మార్పులను ప్రవేశపెట్టాడు. యథేచ్ఛా విహారానికి కొన్ని హద్దుల నేర్పరిచాడు. దాన్నే "వివాహం" అన్నాడు. వివాహాన్ని గురించిన ప్రసక్తి వేదవాఙ్మయంలో కూడా ఉంది.

'వివాహం' ఒక్కటే అనుకోరాదు. అందులో * ఎనిమిది రకాలు ఉన్నాయి.

1. బ్రాహ్మము 2. దైవము 3. ఆర్షము 4. ప్రజాపత్యము 5. రాక్షసము 6. అసురము 7. గాంధర్వము 8. పైశాచికము అని ఆ రకాలు.

* 1. సదాచారముగల వరుని వస్త్రాదులచే నలంకరించి పూజించి చేసెడి కన్యాదానము.

2. జ్యోతిష్టోమాది యజ్ఞప్రారంభమున యథావిధిగ తత్కర్మ నడపిన ఋత్విజుని అలంకరించి చేయు వివాహము.

3. ధర్మార్థము వరునివలన గో మిథునమును దీసికొని కన్యనిచ్చి యథా శాస్త్రముగా జేయుకల్యాణము.

4. వరునిచే "నేను అన్యాశ్రమస్థుడను గాక గృహస్థా శ్రమముననుండి ధర్మమాచరించెద" నని చెప్పించి కన్యాదానము చేయుట

5. బలాత్కారముగా కన్యను దీసికొనివచ్చి చేసికొనే వివాహము.

6. కన్యయొక్క తల్లిదండ్రులకునూ, యథాశక్తిడబ్బునిచ్చి యథేచ్ఛగా జేసుకొనే పరిణయము.

7. వధూవరుల అన్యోన్య ప్రేమచే జేసుకొనే పెండ్లి.

8. నిద్రించియు: త్రాగి మైమఱచియు, శీలము సంరక్షించుకొన పరాకు పడియున్న దానిని సంభోగేచ్ఛచే రహస్యముగా జేసుకొను వివాహము.

ఈ వివాహాలలో మొదటి నాలుగు-బ్రాహ్మణులకునూ, గాంధర్వ రాక్షసములు-క్షత్రియులకునూ ఆసురము వైశ్య, శూద్రులకునూ ప్రశస్తము లనీ, పైశాచికము అందరికీ నింద్యమయినదనీ చెప్పబడింది.

ఇందులోనూ మళ్ళా, శాఖ, ఉపశాఖలు చాలా వున్నాయి. మతం, కులం, జాతి, ప్రాతిపదికమీద మరికొన్ని రకాలు ఏర్పడ్డాయి. ఒక కులంలోనేగల అంతశ్శాఖలలో, శాఖకొక విధంగా పెళ్ళిళ్ళు తయారయ్యాయి. బ్రాహ్మణ వివాహ సందర్భంలో హోమం చేస్తారు. బ్రాహ్మణేతరుల వివాహానికి దీపం వెలిగిస్తారు. ఇలాంటివి చాలా భేదాలున్నాయి.

ఈ వివాహాలను జాగ్రత్తగా పరిశీలిస్తే, ఆయా యుగాలలోని మానవజాతి జీవిత విధానాన్ని, సాంఘిక వ్యవస్థను, నాగరికతను మనం అర్థం చేసికోవచ్చు.

కృతయుగంలో-గాంధర్వ వివాహాలు మెండు; తప్పిన రాక్షస వివాహాలు తరచుగా జరిగేవి. వాని వరుసలు గూడా వున్నట్లు కనబడదు.

బృహస్పతి సొంతయన్నయగు రుచికుని భార్యయైన మమతతో రతిక్రీడలలో తేలాడు. దీర్ఘంగా విచారించి చూస్తే, ఆనాటి వివాహాలు నేటి పాశ్చాత్య దేశాలలోని వివాహాల మాదిరిగా పొడగట్టుచున్నాయి. జారత్వము వలన సంతానము గలిగిననూ తాళి గట్టిన మగ డేవగించుటలేదు. దేవగురువైన బృహస్పతి భార్య, పరపురుషుడైన చంద్రునితో కూడి, గర్భవతియై, బిడ్డనుగని, చంద్రునికే వొసంగి, మరల తాళిగట్టిన బృహస్పతిని జేరి కాపురం జేసింది.

త్రేతాయుగంలో-గాంధర్వ, రాక్షస వివాహాలకు స్వయంవరం తోడయింది. ఒకరిభార్య నొకరు తెచ్చియుంచుకొనుట ధర్మపీడగా ఎంచబడింది. త్రయ్యారణ్యుని పుత్రుడైన త్రిశంకు డవివాహిత నొక్కతెను బలవంతముగా తీసికొని వచ్చినందులకు, తండ్రి కుపితుడై, వానిని రాజ్యభ్రష్టునిగా జేసి, చండాలరూపమున వర్ధిల్లుమని శపించాడు. రామాయణ కాలంలో ఏకపత్నీ వ్రతానికీ ఏక భర్తృకతకూ చాలా ప్రాధాన్యం ఉండేది. సీతాదేవిని రావణుడు ప్రహరించి కొనిపోవటంవల్ల లోకం అతనిని దూషించింది.

ద్వాపర యుగము-నాటికి వావి వరుసలతో పెండ్లిండ్లు నిరాఘాట ముగా జరుగుట ప్రారంభమయ్యాయి. కుంతీదేవి కన్యాత్వమున కర్ణుని కల యుట తప్పను అభిప్రాయము మోసులెత్తుటచేతనే దుర్వాసుని వరము అడ్డముగా పెట్టవలసివచ్చినది. ఆవిడ వంశం కోసం, పరపురుషునితో సంగ మించడాన్ని వ్యాసభగవానుడుకూడా తప్పు కాదనలేకపోయాడు. ద్రౌపది సంగతికూడా ఇటువంటిదే! ఐనుగురు కలిసి, ఒకే స్త్రీని సమిష్టి పంపిణీమీద భార్యగావాడుకొన్నారు. నీతి సంబంధమైన ఈ సడలింపులు భారతకాలం నాటికి ఎలావచ్చాయో మనం తెలుసుకొన్నాం. ఇక. కలియుగంలో- పెండ్లిండ్లకు మిగుల కట్టుదిట్టాలు జరిగాయి. వావివరుసలు లేని పెళ్ళిళ్ళ నల్వురినోటా పడిన నగుబాటు పొంగుతున్నాయి. బహు పతీత్వము లేదనే చెప్పవచ్చు. రాను, రాను, ఈ పరిణామం, పురుషునకు అనుకూలంగా మారుతూ వచ్చింది. ఒక పురుషుడు, అనేకమంది స్త్రీలను భార్యలుగా చేసుకోవచ్చు. కాని స్త్రీ మాత్రం, ఏగ భర్తృకతిగానే ఉండాలి. ప్రస్తుత సామాజంలో ఏకపత్ని, ఏక భర్తృకతా పద్ధతి ఆచరణీయంగా ఉంది

ఏది ఏమైనప్పటికీ వివాహం కూడా "సమాజాంగీకారమును పొందిన వ్యభిచారం" అని పాశ్చాత్యుల అభిప్రాయం. కాని కవిరాజుగారు వివాహ మనేది "జారత్వమునకు గౌరవస్థానము నిచ్చుటకై ఏర్పడినట్లు తోచక పోవు"నన్నారు. కాని, ఈనాడు వివాహ విషయంలో మనకు దోషం కను పించడంలేదు. శతాబ్దాల తరబడి అలవాటు పడటమే దీనికి ముఖ్య కారణ మనుకొంటాను. వివాహ వ్యవస్థను ప్రాతిపదికగా తీసికొని, బ్రాహ్మణ వర్గం, తన పెత్తనాన్ని నిలుపుకొంటూ వచ్చింది. బాపడుచేసిన పెళ్ళేపెళ్ళి. సంస్కృత మంత్రాలే మంత్రాలు అనే స్థితిదాకా వచ్చింది. ఆనాటి ప్రజలూ అలాగే ఉండేవారు. బ్రాహ్మణ పౌరోహితుడు శుభలగ్నాన్ని 'నిర్ణయించి, మంత్ర తంత్రాలతోనూ, బాజా భజంత్రీలతోనూ చేసిందే 'వివాహం' అనే మూఢాభిప్రాయం ఉంది. ఇలాంటి సాంఘిక వ్యవస్థను, వివాహ పద్ధతినీ, యోగివేమన తన సహజ నర్మోక్తుల ద్వారా సంస్కరించడానికి బూనుకొన్న సంగతి లోకవిదితమే. చూడండి ఈ క్రింది పద్యం:

" విప్రులెల్లరునుజేరి పెట్టికూతలుకూసి
సతిని పతినిగూర్చి సమ్మతమున
మునుముహూర్తముంచి ముండెట్లు మోసెరా
విశ్వదాభిరామ వినురవేమ"

ఇలాంటి సంస్కరణోద్యమానికి చౌదరిగారుకూడా కంకణం గట్టుకో వలసి వచ్చింది. వారు "హేతువాదం" తో ప్రజలను మార్చాలని సంకల్పించారు. పట్టాభిషేకమునకై పెట్టబడిన లగ్నము శ్రీరామచంద్రునకు వనవాసమునకు దారితీసిందని రామస్వామిగారు సోదాహరణంగా వివరించారు. దీనితో ప్రజలలో కొంతవఱకు శుభలగ్నము శుభముకలిగించుననే నమ్మకం పటాపంచలయింది.

ఈ "వివాహ విధి" ఇప్పటికి రమారమి 45 సంవత్సరాల క్రితం వ్రాయబడింది. ఆనాటి నుండి ఈ నాటి వఱకూ బ్రాహ్మణేతర వర్గాల వారికిది ప్రమాణిక గ్రంథంగా ఉంటూ వచ్చింది. వరునికిగానీ, వధువుకిగానీ అర్థంగాని మంత్రాలు చదివిన లాభమేమిటి ? వారికి తెలియని భాషలో నీతులు బోధించడం ఎందుకోసం ? ధర్మబోధలు, నీతి ఉపదేశాలు, మనిషి సన్మార్గంలో వుంచడానికే గాని. వినోదం కోసం కాదు గదా ! అయినప్పుడు ఆ చెప్పేదేమిటో వారికి తెలియాలా ? వద్దా ! అర్థమే కానప్పుడు మనం చెప్పితే ఫలితమేముంది ?

కాబట్టే కవిరాజుగారు వివాహ రంగంలో కూడా సంస్కరణను ప్రవేశపెట్టారు. సంస్కృత మంత్రాలను తేట తెలుగు మాటల్లోకి మార్చివేశారు. వధూవరులు ఆచరించవలసిన విధులను తేట తెల్లమైన తెనుగులో ప్రవచించారు. వారే స్వయంగా నడుం కట్టి అనేక వివాహాలు చేయించారు. ఒక పెళ్ళి జేయడం-వధూవరుల నుద్దేశించి ఒక ఉపన్యాసమివ్వడం-"వధూవరులార ! నేడు మీరు బ్రహ్మచర్యమును వీడి గృహస్థాశ్రమమును జేకొన బోవుచుంటిరి, ఆశ్రమముల యందు గృహస్థాశ్రమము ఉత్తమ మైనదియును, గష్టతమమైనది యనియును, మీరెఱుంగవలయును. అతిథి అభ్యాగత పూజలు నిరంతరంబు విసుగులేక యాచరించి గృహస్థ ధర్మమును

జక్కగ నెరవేర్చి నీతి నియమంబులను దప్పక మర్యాదల జవదాటక సత్సం తానమున బడసి దేశ సౌభాగ్యమునకు జాతీయ సౌభాగ్యమునకు తోడ్ప డుదురు గాక !" అని అచార్యసూక్తులు పలికేవారుచౌదరిగారు

తరువాత వరుడు ఇలాఅంటాడు. "ఓ సౌభాగ్యవతీ! ఈ పెండ్లిపెద్దల యెదుట నా పాణి గ్రహణము జేసి ధర్మపత్నిగా జేకొనుచుంటిని. పెద్దలు చెప్పినట్లు 'అర్ధాంగి' వే కాక 'యర్థ సర్వస్వ' మగుదువు గాక. నీవునేనను భేదము లేక మనము జీవయాత్ర గడపుదము."

అంతట వధువు "ఓసుభగా! మీతో జీవయాత్ర గడపుటకు నభిలషించి యిదిగో నా పాణిని మీ కొసంగుచుంటిని. నా జీవిత కాల మెల్ల స్త్రీ జన సహజ మైన యోర్మితోడను- పేర్మితోడను, మీకు దోడ్పడుదును" అం టూంది. వరుడు, వధువుకు తాళిబొట్టు కట్టడం, వెంటనే 'సప్తపది' జరుగు తుంది. అంతటితో పెండ్లి మంగళ గీతంతో సమాప్తమౌతుంది.

ఈచిన్న పుస్తకం-తెలుగు కుటుంబ జీవితంలో ప్రవేశపెట్టిన మార్పు అంతా-ఇంతా కాదు. కరుడు గట్టి ఘనీభవించిపోయిన సంఘంలో చైతన్య మును కలిగించినది. బ్రాహ్మణ పౌరోహిత్యం లేకుండా వందలాది వివాహాలు జరిగాయి. నేడు జరుగుచున్నవి. ఇంకముందు గూడా జరుగుతాయి. ఈ పుస్తకం గావించిన మార్పు కవిరాజు గారినే ఆశ్చర్య చకితులను జేసింది. వారు మూడవ కూర్పు 'తొలిపలుకుల'లో యిలా వ్రాశారు "నేనీ గ్రంథము రచించునప్పుడు ప్రాజ్ఞులయినను నీ గ్రంథస్థాభిప్రాయములకు సుముఖులుగ నుందురని తలంచనైతి. ఏలయనఁ జిరగాలమునుండి ప్రాచీనా చారము సంఘశరీరమునంజివికి జీర్ణమై గబ్బు కొట్టుచున్నను, తెలియం జాలని, తెలిసియుఁ దెలియని యట్టు నటింప నేర్చిన యీ యాంధ్రలోకంబు, విప రీతములుగఁ గన్పట్టు నీ యభిప్రాయములను మన్నింతురని యెట్లు తలం తును ? భగవంతులకు నొక్క సంస్కృత భాషయే కాదు కాదు, ఒక్క గీర్వాణ భాషయే చెవి కింపు సొంపునింపునని తలంచు నీ మూఢలోకంబు వివా హ మంత్రంబులు మాతృ భాషయగు తెలుగున జెప్పఁబడునప్పుడూకొట్టు ననుట కవకాశమేది ? ఎన్ని దోషములున్నను, నొక్క లగ్నమునఁ బెండిలి

జరిగిన యెడల సర్వ శుభములును, సకలైశ్వర్యములును, నాయురారోగ్యములునుకల్గునని విశ్వసించు ప్రాకృత లోకంబు నాయభిప్రాయములకు మారాకుగా నుండునని యెట్లు తలంతును ? "బ్రాహ్మణో మమదేవతా" యను వాక్యమునందు నమ్మకంగల మూర్ఖ ప్రపంచంబు బ్రాహ్మణులు కాని వారిచే వివాహ కలాపంబు జరుపఁబడుటకు నంగీకృతిఁ జూపునని యెట్లను కొన వీలుకల్గును ? కాని యాంధ్ర ప్రపంచ మందు విచిత్ర పరిణామము కడు నత్యల్ప కాలములోనే కల్గినది. ఈ పరిణామము నాకే విస్మయము కలిగించుచున్నది." కవిరాజుగారి వివాహ పద్ధతి అమల్లోకి రావడం వల్ల ప్రధానమైన ఉపయోగాలు మూడు జరిగాయి.

మొదటిది : బ్రాహ్మణ పౌరోహిత్యంవల్ల జరిగే దోపిడీ అరికట్ట బడింది.

రెండోది : వైవాహికం ద్వారా తమకు సంక్రమించే బాధ్యతలూ, విధులూ ఏమిటో వధూవరులకు ఇట్టే అర్థం కావడం.

మూడోది : ఆట్టే పటాటోపం లేకుండానూ, దుర్వ్యయం లేకుండానూ, న్యాయశాస్త్రానికి భిన్నంగాని పద్ధతిలోనూ వివాహాలు జరిపించడం. ఏడు న్నరరూపాయల ఖర్చుతో చౌదరిగారు పెళ్ళి చేయించారంటే బహుశ, విచిత్రంగానే తోచవచ్చు !

ఈ విధంగా రామస్వామి చౌదరిగారు మధ్య తరగతి కుటుంబాలకు తమ పౌరోహిత్యం ద్వారా మహత్తరమైన సేవ చేశారు. వారు ప్రవేశ పెట్టిన మార్పులన్నీ ఒక ఎత్తు. ఇదొక్కటే–ఒక ఎత్తు కాబట్టే వారు ఈనాడు ఆ బాలగోపాలానికీ ఆరాధ్యులయ్యారు.



గేయ నాటిక :

# మానవుని మరొక మజిలీ

—శ్రీ బోయి భీమన్న

( గత సంచిక తరువాయి )

## ఆరవ రంగం

(గుబగుబలాడుతూ ఎదుగుతున్న చేలు. చిమ్మచీకటి విడిపోతూ, లేత ఆకుపచ్చని కాంతి రంగంలో స్థిరపడుతుంది. నీలి చీరను ధరించిన బాలిక – సస్య – నాట్యం చేసుకొంటూ ప్రవేశించింది. మొదట దూరంలో చిన్న పిల్లలా కనిపించి, రాను రాను కొంచెం పెద్దదే అనిపిస్తున్నది. ఆమె ఆట పాటలకు అనుగుణంగా ప్రకృతి అంతా హంగు చేస్తున్నట్టుగా వున్నది. భూలక్ష్మి కూతు రామె జీవి లోకైక సుందరి – విశ్వైక మోహిని.)

లే

లేవే కృషిక జీవి !
తేవే యమృత భావి !
ఈ వేళ — ఈ చేలకు !
　　సారాలు దింపి, శ్రీ
　　సారాల నింపి, భూ
　　స్వర్గాలు నిర్మింపవే !

చాలు తోలి ధరామ తల్లికి
మేలుకొల్పులు పాడవే !

అదనెరంగిన తల్లి రొమ్మున
అమృత భాండము గ్రోలవే ! !

రావె తొలకరి చినుక !
తేవే మెరుపు మొలక !
ఈ వేళ — ఈ చేలకు !
ఉదయించె నవ శకము,
ఉద్భవించెను సుఖము,
ఉద్యోగమును పెంచవే !

మందమారుతమునకు డెందము
సుందరముగ సుమింపవే !
దినమణికి మానసములో మణి
దీపమును వెలిగించవే ! !

రావె యాత్రా శీలి !
తేవె తరుగని శాలి !
ఈ వేళ — ఈ చేలకు !
ఆకలని యార్చ రిట,
వాకిళులు మూయ రిట,
లోక మిట పండ నీవే !

పండ్లు తేనెలు, పాయసమ్ములు
పసిడి గిన్నెల నుంపవే !
అలసి వచ్చిన కష్టజీవికి
అర్ఘ్య పాద్యము లొసగవే !

(సస్య నాట్యం చేసుకొంటూ ఒక ప్రక్కకు నిష్క్రమించింది. రెండవ ప్రక్కనుంచి మేధానిధి ప్రవేశించి, తేరిపార జూస్తూ తల పంకించి, సస్యను అనుసరిస్తున్నట్టుగా నిష్క్రమించాడు. ఆ వెనుక దిక్కులు చూచుకొంటూ, ప్రకృతి సంపదకు ఆశ్చర్యపోతూ, ఆశావతి, భోగయ్య ప్రవేశించారు. మానవ చరిత్రలో ఆహార సేకరణకు రాతి సాధనాలను ఉపయోగించడం, నిప్పు చెయ్యడం, ఆహారాన్ని కాల్చి తినడం, మాటలు నేర్వడం, పశువుల్ని మచ్చిక చెయ్యడం మొదలైనవన్నీ విప్లవాలే. అందులో మొట్టమొదటి మహా విప్లవం వ్యవసాయం నేర్వడం. సృష్టి వికసిస్తున్నది. దానితో మానవుడు వికసిస్తున్నాడు. మానవుని కృషితో నేడు తిరిగి సృష్టి సస్యశ్యామల మయింది! ఆశావతి ఆనందంలో మునిగింది. భోగయ్య ఆలోచనలో మునిగాడు.)

భోగయ్య :

ఇటు చూడు, ప్రియురాల !
అటు కాంచవే, బాల.
తీరాల పొలము లే
తీరుగా నున్నాయి !
నయనపర్వముగా వెలయలేదా ?
నా మాట మంత్ర మవునా, కాదా ?

బోళామనిషి నంచు
వేళాకోళము చేసి,
కోతలకు మొనగాడు
కేతిగా డన్నావు !
చూచినావా నా మహత్తు ?
సృష్టించినాను సంపత్తు !

ఈ పూలు దూసుకో !
ఈ పండ్లు కోసుకో,
ఈ రమ్య వనమెల్ల
నీ రాజ్య మేలుకో !
స్వేచ్ఛగా తిని, తిరుగు, నీ విందు,
చీకు చింతలు లేవు నీ కెందు.

ఆశావతి :

ఓహో ! నీ యాదేశ
మ్మర్వి పాలించెనే !
అబ్బా ! నీ మాటలో
అధికార మున్నదే !
పేదవాడవు కావు నీవు, నేడు నా
ప్రేమ కర్త్వత పొందినావు !

ఎంత ధాన్యపు పంట !
ఎంత ఆకలి మంట !
సిరి కౌగిలింతలో
సురిగి పోతున్నాను.
భూమికంతకు నేన రాణిని, జీవి
భుక్తి ముక్తులకెల్ల పాణిని !

కోరి నే నీ వంక
గోరింక పిట్టనై.
చెలరేగి రంగు రం
గుల రామ చిలుకనై

దొరకాయల నెల్ల దొర్లింతు నేల,
పిల్లకాయల నెల్ల పొరింతు చేల.

పసరు పచ్చిక నేల
పాముగా సాగేను,
పండి వాలిన చేల
బసివినై చూచేను
త్రేల్చివేసే నెల్ల భూమి, నేడు
త్రెంచివేసె నెల్ల రామి.

(మహోత్సాహంతో ఆశావతి తోట అడ్డబడుతుంది. కనిపించిన కాయగసరులతో పొట్ట నింపుకొంటుంది. తిన్నవి తింటూ పారవేస్తూ ముందుకు పోతుంది. అడ్డం వచ్చిన మొక్కలను, పైర్లను ఊడబెరుకుతుంది. తోటంతా చిందరవందర చేస్తుంది. ఈ అఘాయిత్యాన్ని దూరంనుంచి భూలక్ష్మి చూచింది. ఒక్క గంతులో ఆశావతిని సమీపించింది. ఆమె స్వేచ్ఛాప్రవర్తనను అరికట్టే ఉద్దేశంతో ఆమె చేతిని గట్టిగా పట్టుకొన్నది. ఆశావతి కోపంగా భూలక్ష్మి చేతిని విదలించింది.)

ఇదేమిటమ్మా ? ఇదేమిటమ్మా ?
ఇంత అల్లరికి దిగినావు ?
పిందెలు కోసీ, మొగ్గలు దూసీ
చిందరవందర చేసేవు !

పాలే పట్టని పసరు కాయలో
పండిన పొట్టకు రస ముంటుందా ?

విచ్చీ విచ్చని పచ్చి మొగ్గలో
పిచ్చెత్తించే పస పుడుతుందా ?

గిల్లెద వయొ, పసిపిల్లలు బోలిన
గింజల పీకలు నిర్దయతో :
త్రొక్కెద వయొ, వరి మొక్కల డొక్కలు
ముక్కలుగా నిర్లక్ష్యముతో :

ఆశావతి :

నా పొలాలలో, నా తోటలలో
నా యిష్టము, నీ కేమే మధ్య ?
రాల్చివేతు పువ్వులు, మొవ్వల నే
కూల్చివేతు—నీ కెందుకు దుగ్ధ ?

మహిమలు గల నా మగని దృష్టిచే
మహి వెలసిన దీ పుష్కల సృష్టి,
నా యదృష్ట మిది, నీ కే మున్నది ?
నంగనాచి : చాలించవె సోది.

ఊంపలు త్రవ్వక బ్రతికే చింపిరి
గంపవు, నీ కేరీతి తెలియునే
స్వేచ్ఛా వర్తనలో గల ఖొంపిరి ?
సిరితో చెర్లాటమంటే, తెంపరి :

(భూలక్ష్మి ఆశ్చర్యపోతుంది ! తాను, తన భర్త సూరన్న — చంద్రన్న వగైరా కష్టజీవుల సహాయంతో కష్టపడి సేద్యం చేసిన పొలాలు, పెంచిన తోటలు, ప్రజలందరూ ఉమ్మడిగా అనుభవిస్తున్న ఫలసాయం—అంతా ఒక్కసారిగా నాదంటున్నది ఆశావతి ! పోనీ,

ఎవరిదో ఒకరిదె. ఈ నాశన కర్మకాండ దేనికి ? ఎవరిదైతేమాత్రం-సంపదను నాశనం చేసుకొంటూరా ? భూలక్ష్మి బొమ్మలా నిలబడి పోయింది.)

భూలక్ష్మి :

నీది, నా దను మాట నేడు విన్నాను,
ఎవరిదైతే నేమిటే, వెఱ్ఱిదాన ?
మన మందరము జగన్మాత బిడ్డలము,
ఆమెదే పొలమెల్ల, వ్యక్తి దెట్లవును ?

మానవు లెల్ల ఉమ్మడి కుటుంబము గదా ?
ఆస్తులెల్లను ఉమ్మ డాస్తులే కాదా ?
తావేది, నీది నా దను వాదమున కిందు
ఎచ్చట తెచ్చినా వీ మత్తు మందు ?

ఎవరెవరి, కేమేమి, ఎంతెంత వలయునో,
జగదంబకే తెలియు, జగతి నంతయు కలదు,
పంచుకొని తింద మీ పంచభూతా లిచ్చు
పంచభక్ష్య, లింక పట్టింపు వలదు :

పుష్కలాహార సంపూర్ణమౌ నేల,
వనజాక్షి ! నీది నా దను భేద మేల ?
పంచుకొన్నవటమ్మ పక్షు లీ చెట్లు ?
విభజించుకొన్నావా ఇభము లా బీళ్లు ?

నీ కెంత వలయునో నిండుగా గైకొమ్ము,
చేతనైనంతగా చేయుమా సాయమ్ము,

సామర్థ్యముకు మించి శ్రమ పడబోకు,
అవసరానికి మించి అందుకోరాకు.

సుంకుపై నున్న దీ వంక సన్నపు చేను,
గూడ వేసెద, మందుకోవమ్మ తాడు !
మా బావ ఆ దుక్కితో బాధపడుచుండె,
నీ భర్త పోయి కొంచెము సాయపడలేదె ?

(ఆశావతి నిశ్చేష్టురా లవుతుంది. అటూ ఇటూ పారజూస్తుంది. కొన్ని చేలు పొట్టమీద, కొన్ని పువ్వారంమీద ఉన్నాయి. దూరంలో క్షేత్రయ్య అకు మడి కాబోలు దున్నుతున్నాడు. చేలకు నీరందడం లేదు. ఆ పరిస్థితిలో సూరన్న, చంద్రన్న ప్రవేశించారు.)

సూరన్న :

వానదేవుడి వళ్లు వాచిందిరా !
గాలి దేవుడు మేడ గట్టాడురా !

చంద్రన్న :

కురిసి, కురిసీ యెందు
కూలబడి పోయాడో !
వీచి, వీచీ యెచట
విరగబడుతున్నాడో !

సూరన్న :

వెదకరా నా తండ్రి, వేదాల పుటలు !
పెట్టవే నా తల్లి, పెద్దలకు నతులు !

చంద్రన్న :

తెలిమబ్బు కొండల్లో
తిరుగుతున్నాడో !
తలిరాకు పంకాల
కులుకుతున్నాడో !

సూరన్న :

పల్లాలలో దొర్లి ప్రవహించు నీరు !
మెరకలను తడిలేక దురపిల్లు నారు !

చంద్రన్న :

పాతాళమున కేగి
పండుకొన్నాడో !
తెరలెత్తి యే కడలి
తేలిపోయాడో !

(సమీపంలో భూలక్ష్మి కనిపిస్తుంది. చూచి వందనం చేస్తారు. అక్కడ గల నీరు గూడను ఆమె వారికి అందిస్తుంది.)

భూలక్ష్మి :

పల్ల మెరిగిన నీరు
ప్రజల నే మెరుగు ?
అడ్డు కట్టలు పోసి
ఆపండి వాగు !

అగిసి కంపలు కోసి,
జిగి మన్ను పోసి,

వెడద బోదెలు తీసి
వెయ్యండి గూడ !

ఆశతో కనుచున్న
దా రక్త శాలి.
పొట్టతో నున్న దా
మెట్ట పొలమంత.

కప్ప నూరేగించి,
క్రతువు లొనరించి,
చిక్కిపోయెను రైతు
చినుకైన పడక.

కొండ కోనల మేసి
పండుకొన్నది మొగిలు,
నెమరు నురుగున వాగు
నిండి పరువెత్తు,

తాటి యాకుల గూడ
తంత్ర మెరిగిన గూడ
గూడతో నది నీరు
తోడ రండిక మీరు !

(భూలక్ష్మి, సూరన్న, చంద్రన్న నిష్క్రమిస్తారు. రంగంలోని కొంత కాంతి వారితో కూడా పోతుంది. ఆశావతి దిగాలుపడి చూస్తూ ఉంటుంది. మబ్బు పట్టినట్టుగా వున్న అక్కడికి భోగయ్య వచ్చి కాయలు నములుతూ ప్రవేశించాడు. అతణ్ణి చూడగానే ఆశావతి ఉగ్రురా లయింది. ముఖం ఎర్రబడింది. ఆమెను చూచి భోగయ్య ఉలిక్కిపడ్డాడు.)

ఇదియెల్ల నా సృష్టి
యే నంచు బొంకితివి :
ఏమోయి, సోమరీ :
ఇదియేన మగ సిరి ?

చూడు మా పొలములో
వాడ వాడంతా,
భూదేవి కేరీతి
మ్రొక్కుతున్నారొ :

క్షేత్రయ్య పాలించు
క్షేత్రాల బట్టి
మనవంచు కల్ల లా
డిన నేరమునకు.

భూలక్ష్మి నన్నెత్తి
పొడిచింది చాల,
వాచింది నెత్తి చీ
వాట్లతో నాకు.

అతని చెమ్మట జాలు
ఆ పంట చేలు,
ఆమె కుంకుమ రేఖ
ఆ యేరువాక

నెత్తురు కరగించి,
నీరుగా పారించి,

పండింత్రు సర్వ సం
పదలు దంపతులు :

(భోగయ్య అప్రతిభుడై అలానే చూస్తూ, కొంచెంసేపు నిలబడ్డాడు. కొంచెం తెలివి తెచ్చుకున్నాడు. పొలమంతా ఒకసారి పరకాయించాడు. అతనికి ఎక్కడ చూచినా వ్యవసాయపు పనులే కనిపిస్తున్నాయి.)

భోగయ్య :

ఈ వినూతన సృష్టి
యెల్ల నా దనుకొంటి,
ఏ యుక్తి క్షేత్రయ్య
కీ శక్తి నిచ్చెనో !

మించి పోయిన దేమి ?
మెలత నాతో రమ్మ;
భాగ్య హేతు వదేమొ
పట్టుకొందము లెమ్మ !

అతనితో పని చేసి,
ఆమె స్నేహము చేసి,
కల రహస్యము లెల్ల
తెలిసికొందము పోయి.

(ఇద్దరూ వడివడిగా ముందుకు అడుగులు వేస్తారు. వారిని చీకటి కెరటం అనుసరిస్తుంది.)

కవిత :

# నా బ్రదుకు

శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వరరావు

మత్పురాదేహ శిధిల సంరంభవేళ
నీవె-ఒకసారి నన్ను నవ్వించినావు
ఆ మహానంద బృందావనాంతమందు
కట్టివేసెదనని ఆస పెట్టినావు.

ఏను నీ కేమి కీడు కాంక్షించినాను—
ఇట్లు బ్రదుకెల్ల మ్రోడువారించినావు
కనులు పెరికించి ఒక ముండ్ల కంచలోన
నన్ను పడద్రొబ్బి నవ్వుచున్నావు నీవు.

ముండ్లు కావివి మోహన పుష్పదళ వి
నిర్మితంబైన తల్పమంటివిలె గాని
ఉరి బిగించితి వది యుక్కుదో—మెఱుంగు
పింజదో లెక్కయా ? ప్రాణ భీరువునకు.

ప్రభు ! దయామూర్తివనుచు నెప్పటికి నపుడె
కోటి మనసులు నీమీద నాటుకొంటి
కాని ... ... ...
నా బ్రదుకు కింక మనసార నవ్వఁగలన ?

బాలవాఙ్మయం పుట్టుపూర్వోత్తరాలు :

# పరాశర విమర్శమీద పరామర్శ

—శ్రీ "సోమనాథ్"

గత 1961 ఆగస్టునెల 'స్రవంతి' సంచికలో "బాలవాఙ్మయము—దాని పుట్టు పుర్వోత్తరాలు" శీర్షికను వెలువడిన, నా వ్యాసమును విమర్శిస్తూ, పరాశరగారు సెప్టెంబరు స్రవంతి—సంచికలో వ్రాశారు! శ్రీ వాత్సవగారిమీద కూడా ఒక చిన్న విసురు విసరేరు! అంతేగాదు. నేను ఆ వ్యాస రచనకు అవసరమైన విషయ సేకరణము చేసినట్లు కనబడదు—అని సెలవిచ్చారు—పరాశరగారు!

పరాశరగారి విమర్శకు జవాబు వ్రాయడానికి ఉపాధ్యాయ వృత్తి వలన తీరిక దొరక్క పోవడముచేత—ఇలా ఆలస్యముగా జవాబు వ్రాయాల్సొచ్చిందనే దానికంటే—కలకత్తా ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి 'సోవనీర్' లో ప్రచురితమైన శ్రీ న్యాయపతి రాఘవరావుగారి "మన బాల వాఙ్మయం"— వ్యాసము చదివి రాయాలని—ఆ పత్రిక రాక కోసరము, ఎదురు చూడడంవలన. వెంటనే పరాశరగారి విమర్శనకు, సమాధానము పంపజాలక పోయినందుకు విచార పడుతున్నాను.

నాకు మాస్టరీ శిక్షణయందే గాక ; సాహితీ వీధులలో గూడా మార్గదర్శకులు అయిన, స్వర్గీయ శ్రీ చింతా దీక్షితులు గారి "ప్రజా—వాఙ్మయము" అను గ్రంథమునందు "బాల సాహిత్యం"—శీర్షికను వ్రాసిన భాగమందలి కొంత భాగమును. బాలవాఙ్మయము పుట్టు పుర్వోత్తరాలు తెలుసుకునేందుకు—పరాశరలాంటి వారికి కరదీపికగా ఉపయోగ పడగలదనే ఉద్దేశ్యం తోటి. ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

"వెనకటి కాలంనుంచీ తెలుగు-దేశంలో, బాల బాలికల కోసం ఉద్దేశించబడ్డ సారస్వతం, ప్రచారంలో ఉన్నది. కాని కవులూ, గ్రంథ కర్తలూ, కావ్యనాటకాదులు తాటాకులమీద వ్రాసినట్టుగా బాల సారస్వ తం వ్రాసి ఉంచలేదు."

"లిఖిత రూపంలో లేని సారస్వతం ఆ నోటినుంచి ఆ నోటికి పరం పరాగతంగా నేటివరకూ వచ్చినది. తాతలూ, తండ్రులూ, తల్లులూ ముస లమ్మలూ, తమ వశంలో ఉన్న బాలసారస్వతాన్ని పిల్లల వశంచేశారు.

"నాటు కథలు (folk tales) ; నీతి కథలు (fables) అద్భుత కథలు (fairy tales) బాలగేయాలు (childrens rhymes) అభినయ గీతాలు (Action songs) ; సమస్యలు, పొడుపుకథలు (Riddles) మున్నగునవి లిఖి తముకాని బాల సారస్వతములో చేరుతవి."

"———బాలుర గ్రంథాల్లో—ముఖ్యముగా చెప్పుకోదగ్గది పంచ-తంత్రము ఇది బాలురకొరకు ప్రత్యేకంగా ఉద్దేశింప బడ్డ గ్రంథము. మన దౌర్భాగ్యము వల్ల దీనిని పెద్దలు తమ వశం చేసుకుని బాలురకు దక్క కుండా చేశారు. దీని ప్రాచీన కవులిద్దరు పద్యకావ్యాలుగా తయారుచేసి పాడుచేశారు. చిన్నయసూరి, వీరేశలింగము, వెంకటరత్నము బాలురకు అలవిగాని భాషలో వచనముగా వ్రాసి, పండితులకు మాత్రమే గ్రంథంగా చేసుకున్నారు.

వెనుకటి కాలంలో స్త్రీలనూ బాలురనూ దృష్టిలో పెట్టుకుని వారికి పనికి వచ్చేటట్టు గ్రంథములు వ్రాసిన బుద్ధిమంతులు లేకపోలేదు. వారిలో ఎన్నుకో దగ్గ పండితుడు రావిపాటి గురుమూర్తిశాస్త్రి. పంచతంత్రము, ద్వాత్రింశత్సాలభంజికల కథలు ఈయన పిల్లల కోసరమే వ్రాశాడు. గద్య చింతామణి చూస్తే పలువురు పండితులు వెనుకటి కాలంలో పిల్లల కుచితమైన గ్రంథాలు వ్రాశారని గ్రహించవచ్చును.

దీనినిబట్టి మన పుత్తాతల హయామునుంచి పిల్లల సాహిత్యమనేది గ్రంథస్థము చేయబడక జనసామాన్యము నోళ్ళయందే నిలిచిపోయిందని

తేలుతోంది! అలాంటి మన పూర్వ వాఙ్మయ సంపదను శ్రీయుతులు నేదునూరి గంగాధరం, చింతాదీక్షితులు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వంటి వారెందరో—సేకరించి ఉండిరి.

"1908, వరకు ఆధునిక బాల వాఙ్మయం పుట్టలేదు. అంతవరకు పెద్దల సహాయం లేందే అర్థం చేసుకోలేని భాషలో పిల్లల పుస్తకాలు వచ్చాయి, ఆ భాషలో వ్రాస్తేగాని బడులలో వాటిని ప్రవేశ పెట్టరనే భయంతో, అలా వ్రాసేవారు," అని రాశారు—పరాశరగారు!

కాని అప్పటికి మన దేశము "మానసిక శాస్త్రము, సైకాలాజీ" ఎరక్క పోవడమే—కారణం!

ఇక ఆవేలేవిటి? ఇవాల్టి పాఠ్య గ్రంథాలు ఏ భాషలో—వెలువడుతున్నాయి—పరాశరగారూ!

"సాహిత్యానికి చరిత్ర వ్రాస్తే అది ముందు తరాలవారికి మార్గదర్శకంగా ఉండాలి."

పరాశరులు, నా వ్యాసాన్ని ఒక అసమగ్రమైన బాల వాఙ్మయ చరిత్రగా భ్రమించి పప్పులో అడుగుపెట్టేరు ! నేనే గనుక బాల వాఙ్మయ చరిత్రనే వ్రాయడానికి పూనుకుని ఉన్నట్లయితే, ఆ వ్యాసము యొక్క పతాక శీర్షిక, అలాంటి పేరుతోటి వ్రాసి ఉండేవాడిని కాదు!

ఇంతకీ, ఆ వ్యాసంలో, దీక్షితులు గారి హయాంలో, పరిణతి బొందిన బాల సాహిత్య వీధుల్లో—నేటివరకూ ఉత్తమ సాహిత్యంగా ఎన్నికకాబడిన గ్రంథాలనీ; రచయితలనీ—సంక్షిప్తముగా వ్రాయడం జరిగింది!

పరాశరగారు సెలవిచ్చినట్లు నేను "బాలవాఙ్మయ చరిత్ర" వ్రాసి ఉన్నట్లయితే—భవదీయుడు కూడా ఒకప్పుడు స్వంతపేరుతోటి ఆంధ్రప్రభ, ఆంధ్రవారపత్రిక, బాల, బాబు, మాతృసేవ, ఆంధ్రమహిళ" లాంటి పత్రికలలో— పిల్లలకోసరమని రచనలుచేసి, ప్రకటించిన—స్వతంత్రభారత పౌరు

లలో ఒకడయిన—వీడుగూడా తన నామ ధేయాన్నే (ఇతరుల పేర్ల మాట అలా వుంచండి) తాను వ్రాసే—చరిత్రలో—వ్రాసుకోలేనంతటి మతిమరపు ఉంటాడంటారా ? మహాశయా ?

వాస్తవానికి మన తెనుగు పిల్లలకు గాను వ్రాయబడిన సాహిత్యము సమగ్రముగా లేదు. ఇతర దేశాలతోటి పోల్చిచూచిన ఎడల మన బాల—వాఙ్మయము చాలా వెనుకబడే ఉందనే సంగతి అంగీకరించాల్సుంది.

ఇంతవరకు తయారైన బాలసాహిత్యము చాలావరకు కొద్దివయసు బాలబాలికలకే ఉపకరిస్తుంది. అంతేగాదు. స్థాయికూడా ఇంకా పెరగాల్సుంటుంది.

ఈ మధ్య కేంద్ర సాహిత్య అకాడమీ గూడ ఈ అభిప్రాయాన్నే వెలిబుచ్చింది. మరి ఈ విషయం పరాశరులు, పత్రికల్లో—చదివారో లేదోమరి తెలీదు !

"వెంకట పార్వతీశ్వర కవులు బొమ్మల రామాయణం, బొమ్మల భారతం వ్రాశారు" అన్నారు. కాని, పెద్దల కోసరమని పలువురు, రామాయణాల్ని—భారతాల్ని రాస్తున్నట్టే-వీరేగాదు-ఇంకా చాలామంది రాయనూ రాశారు; ప్రచురణ కర్తలు ప్రచురించనూ ప్రచురించారు! మరి మనది స్వతంత్ర భారతం కాదుమరీ! కొత్తసంగతులు ఎవరూ రాయలేదుగా ?

ఇంతకూ, నేను మన బాల-సాహిత్యము యొక్క స్థాయి మరోమెట్టు పైపోకియి-ఉన్నతస్థాయి అందుకోవాలనే అకాంక్షతోటి ఉత్తమ బాల సాహిత్యము సృష్టించడానికి రచయితలు కృషిజేయాలని అభ్యర్థించాను!

మన విశ్వవిద్యాలయాలు ఏవైనా, ఇంకా—బాలవాఙ్మయ చరిత్ర, పరిశోధనయందు—డాక్టరేట్ డిగ్రీ ప్రసాదించే ఏర్పాటు చేశాయో లేదో—నాకైతే, తెలీదు గాని సుమండీ!—ఈ బాలవాఙ్మయ చరిత్ర పరిశోధకుడుగా. డాక్టరు కాదలచిన (?) పరాశర—"మా ప్రొడక్షన్ నంబరు 9" లాగా;

పత్రికా ముఖంగా త్వరలో సంపూర్ణ చరిత్రను అందివ్వగలము" అని హామీ ఇచ్చారు— ఫరవాలేదు !

కాని---ఒక్క విషయము మాత్రము పరాశరగారు మరిచి పోకుందురు గాక ! తదితర ప్రపంచ భాషలలోని బాలవాఙ్మయమును గురించి గూడా తులనాత్మక సమీక్ష చేస్తూ వ్రాయగలిగినపుడే-త్వరలో వెలువడ రానున్న—మీ "బాలవాఙ్మయ చరిత్ర" చరితార్థము కాగలదు.

మరి ఇక తమ "బాలవాఙ్మయ చరిత్ర చదవడానికి- వేచి వుంటాను— అంతవరదాకా !

కవిత:

# కార్తికశశి

—శ్రీ అన్నాప్రగడ శ్రీరామమూర్తి.

కార్తిక పూర్ణిమా శశి వికాసము మూసిన కంటి మూతకున్
స్ఫూర్తి మదంశు వేచు తెరపు ల్లయినట్టిది నింగి లచ్చికిన్
వర్తులమైన వెన్నొసటి పైగల బొట్టు విడంబమైన యా
మూర్తియె నా యెడందనలు మూలల చీకటి వేరు విత్తగున్—

ధవళిమరక్తి మమ్మ ప్రియ దర్శన యోగ్యముగా విమిశ్రమై
దివి గల దీప మీ భువికి తేజ మొసంగుట సృష్టి చిత్రమై
అవితథ శక్తియున్ భగవ దంశము స్పష్టము కాదొడంగె, మా
నవు డెపు డిట్టి దీప మిడినాడు జనించిన దాది నేటికిన్-

శరదిందూదయ వేళలో ప్రణయ పూజా తన్మయత్వంబులో
వర దాంపత్య కళా విలాస యువకద్వంద్వంబు వీక్షింప దా
సురవర్గ క్షుధ తీర్చు సజ్జనుని దృష్టుల్ తను మోమైన తత్
గురు సౌభాగ్యము చెందుచుండు కవి చంద్రున్ నామ సామ్యంబునన్

నింగి వెలుంగుచున్ కళలు నిండిన మోమున వెండికంచవున్
బంగరు పొన్ను వోలె కను పండుగయై సుఖశీత లాచ్ఛకాం
తిం గురియించు చుండె నతి తీక్షణ కరమ్ములు మాల్చి దైవ శ
క్తిం గురితింప జేసి రవికిన్ భువికిన్ శశి మధ్యవర్తియై—

పూచిన పల్లె పందిరిని బోలిన చుక్కల యాకసాన దో
బోచుల చందమామ నగు మోమది మబ్బు తెరల్ పెకల్చి యా
లోచన లోచనమ్ములు విలుప్తత చెందిన మాన వాటవిన్
డోవియుతోచనట్టి పనితో నిటుదేనికి గాయువెన్నెలన్—

ఆ శోభామయు చెంతకున్ వెడలి శల్యంబుల్ పరీక్షింతురా
యీ శాస్త్రజ్ఞులు వారికిన్ వశము కానేవ చ్చుగా నీ రసా
వేశంబంది కవీంద్రు లొందెడు సుఖా విర్భూతి సిద్ధించునా
కోశంబున్ విడదీసి త్రుంపి పువు రేకుల్ చూడ వాసించునా.

కార్తిక శుక్ల పక్షనిశగాసిన వెన్నెల పాలవెల్లిలో
పూర్తిగ మున్గి పోయినది భూతల మంతయు మఱ్ఱి.యాకుపై
వర్తిలు గోప బాలకుని భంగి ప్రియా హృదయాంక పీఠిపై
భర్త యొకండు పక్ష్మములు వ్రాల్చెను సృష్టికి నాంది చర్యగా-

ఈ శరత్కాల చరమ నిశాశశాంక
మధుర రోచిస్సు లానంద మధువు తోడ
తదవసాన విచార బాధా లవంబు
రంగరించెను నా యంత రంగ మందు.

కుంభ రాశిని నారాశి కుండలి మెయి
రాహు సంయుక్త మైన చంద్ర గ్రహంబు
తాను బలహీనమై బలహీన పరచు
నన్ను నాకిక గ్రహ జపాంతరము కవిత

నేను ద్విజుడను ద్విజరాజు తాను, నాదు
తనను సేవించు ధర్మంబు తలచి తలచి
యీ కవితోపహారమిట్లిచ్చు చుంటి-
అతని కిది నూలు పోగు లాగైన జాలు-



ఏకాంకిక

# మా తాతలు నేతులు తాగేరు ...

—శ్రీ పరాశర

(విశ్వకవి శ్రీ రవీంద్రనాథ్ టాగూరు రచించిన 'బాబూస్ ఆఫ్ నయంజోరు' అను కథానికను అనుసరించి రచించినది.)

(అది చితికపోయిన జమీందారు కైలాస్‌నాథ్ బాబు కలకత్తాలో నివసిస్తున్న ఇంటిలోని ముందు గది. గతకాలపు వైభవానికి నామ మాత్రంగా నిలచియున్న వస్తు సామాగ్రితో ఆ గది అమర్చబడి ఉంటుంది. ఒకమూల టేబిలు, దానిమీద రాధా కృష్ణుల విగ్రహము, తమలపాకుల పెట్టె (పాన్ దాన్) కలం సిరాబుడ్డి. ఏవో రెండు గ్రంథాలు ఉంటాయి. రెండవమూల ఫ్లాట్‌ఫారం దానిమీద పరుపు, దిండ్లు దుప్పటి గలేబులు లేకుండా అసహ్యంగా ఉంటాయి.

తెర ఎత్తగానే కైలాస్‌నాథ్ చిన్న ధోవతి కట్టుకుని, బనీను వేసికొని ప్రవేశిస్తాడు. అతని చేతిలో ఉతికిన ఒక ధోవతి, ఒకలాల్చీ, ఒకదుప్పటి, గలేబులు ఉంటాయి. టేబిల్‌మీది వస్తువులను కింద పెట్టి చేతిలోని దుప్పటిని దానిమీద వేసి బట్టలను యిస్త్రీ చేసికోనవలెనని సిద్ధం చేసికొంటూ ఉండగా వీధి తలుపు చప్పుడవుతుంది.)

మధుసూదన్ : (బయటనుండి వీధి తలుపు కొడుతూ) తాతాజీ! తాతాజీ!

కైలాస్ : (తన పనికి అంతరాయము కలిగించి నందుకు నుదిటిమీద కొట్టుకుని చికాకు కనబరుస్తాడు గాని మాటల్లో కనబడనీయడు) ఎవరు నాయనా?

మధుసూధన్ : నేనే తాతాజీ మధూని.

కైలాస్ : ఓహో మధుసూదనా! నాయనా మధూ యిప్పుడే స్నానానికి వెళ్లాలనుకుంటున్నాను. కాస్సేపు పోయి మళ్ళా వస్తావు కదూ!... ఏమీ అనుకోకు నాయనా !

మధు : అలాగే తాతాజీ.

కైలాస్ : అమ్మయ్య వెళ్ళాడు. సరిగ్గా సమయానికి ఊడి పడ్డాడు—నా పనిని తొందరగా ముగించకపోతే ఎవరో ఒకరు వస్తూనే ఉంటారు. (ఇంట్లోకి వెళ్ళి యిస్త్రీ పెట్టె తీసుకువచ్చి బట్టలు యిస్త్రీ చేయబోతూ ఉండగా మళ్ళా తలుపు చప్పుడవుతుంది.)

కైలాస్ : ఎవరు నాయనా !

హరి : నేను హరిని తాతయ్యా!

కైలా : హరిచరణువా ? కాదు నాయనా యిప్పుడే భోజనానికి వెళ్ళాలనుకుంటున్నాను. ఒక్క అరగంట పోయి వస్తావూ? ఈ ముసలి తాతకు కాస్త నుడీ, ఆచారం ఏడ్చింటలే. అందుకని తలుపు తీయలేను. మరేం అనుకోకు.... మళ్ళా వస్తావు కదూ !

హరి : అలాగే తాతయ్యా!

కైలా : తెల్లారిందంటే సరికి వీళ్లు అలా వస్తూనే ఉంటారు. నా పనులు పూర్తికావు త్వరగా యీ బట్టలు యిస్త్రీ చేసుకోనడం ఎందుకైనా మంచిది (త్వరగా బట్టలు యిస్త్రీ చేసి దివ్వెటి కర్రమీద వేస్తాడు. దిండ్లకు గలేబులు తొడుగుతాడు శేటిల్ సర్ది యిస్త్రీ బట్టలు వేసుకుని, కాస్త సెంటు రాసుకుని వీధి తలుపు తీసివచ్చి, ప్లాట్ ఫారంమీద కూర్చుని తాంబూలం వేసుకుంటూ ఉంటాడు.

రాధా : (వస్తూనే) నమస్కారం తాతాజీ !

కైలా : ఓహో రాధాబాబా! కూర్చో, అబ్బాయికి ఎలా ఉంది నాయనా ?

రాధా : ఇంకా అలాగే ఉంది తాతాజీ! పీడి జబ్బుతో రెండు నెలలుగా దుంప తెగిపోతోందనుకోండి తాతాజీ. అటు చావుకాదు ఇటు బ్రతుకు కాదూ.

కైలా : హరి! హరి! (చెవులు మూసుకుంటాడు) ఎంత మాటన్నావు? అలా అనకూడదు నాయనా! మనుష్యుల మయిన మనకు కాక పోతే యింకెవరికి వస్తాయి చెప్పు యీ కష్టాలు : కష్టాలను చిరునవ్వుతో ఎదుర్కోవాలి నాయనా!

రాధా : చేతనయితే అలాగే చెయ్యొచ్చు తాతాజీ! ఇంట్లో కష్టాలు ఉప్పెనలాగా వచ్చిపడి మనస్సును ఊరకే చికాకు పెడుతూ ఉంటే చిరునవ్వు ఎక్కడనుంచి వస్తుంది, చెప్పండి?

కైలా : ధైర్యం పురుష లక్షణం అన్నారు...

రాధా : అది మీలాంటివాళ్ళకు చెల్లింది. అంతా మీలాగ ఉండగలరా

కైలా : మరేం. ఒకసారి ఏమయిందను కున్నావు! మా నాయనగారు పోయారు, మరి మూడు రోజులకే మా అమ్మగారు మంచమెక్కారు. ఆ సమయంలోనే మా ఆవిడకీ వంట్లో బాగుండలేదు సరిగ్గా నిద్ర ఆహారంలేక నా ఆరోగ్యమూ చెడిపోయింది. అటు, పిల్లలకూ సుస్తీ చేసింది. మా కోట ఒక అస్పత్రి అయిపోయింది అనుకో. ఆ ఒడుదుడుకుల్లో మా దివాన్‌జీకీ కూడా ఏదో కష్టమొచ్చింది. ఎస్టేటు పనులు సమేతం నామీదనే పడ్డాయి. శిస్తులు సరిగ్గా వసూలు కాలేదు. ఈ కలకత్తానుండి మా నయంజోరుకు డాక్టర్ల రాకపోక లకు విధి విరామం లేదంటే నమ్ము! అయినా నేను చిరునవ్వుతో అన్ని కష్టాల్ని ఎదుర్కొన్నాను.

రాధా : మీకేం మీరు మహారాజులు.

కైలాస్ : అన్నీ చక్కగా ఉంటే అంతా మహారాజులే! మాకు మాత్రం కష్టాలు లేవను కున్నావా? రోగాలు మాకు రావనుకున్నావా

మా తాతలు నేతులు తాగేరు

రాధా : అదనంగామాకు ధనలోపం ఒక కష్టం, ధనమూలం యిదమ్ జగత్తు అన్నారు. అది లేందే ఏ పనీ జరుగదు గదా?

కైలాస్ : నిజమే అనుకో! అయినా దిగజారిపోతే కష్టాలు పోతాయా? చెప్పు

రాధా : అదినిజమే-కాదనను (ఓ పదిసెకండ్లు పరకాయించి అటు ఇటు చూచి, చూడండి నాకో వంద రూపాయలు సహాయం చేశారంటే ప్రస్తుత కష్టాలు ఏదో ఒకలాగ తట్టుకోడానికి వీలవుతుంది.

కైలాస్ : ఓస్, ఇంతే కదా! తప్పకుండా యిస్తాను. మీలాంటి మిత్రులకు సహాయ పడకపోతే యింకెవరికి చెప్పు? ఒక్క వంద చాలా?

రాధా : చాలు! చాలు!

కైలా : ఉండు చెక్కు రాసిస్తాను.

రాధా : చెక్కు ఎందుకు-ఉంటే రొక్కంగానే యివ్వండి మహారాజా!

కైలా : చూడునాయనా నా దగ్గిర ఎప్పుడూ రొక్కం ఉండదుగా! ఏది కొన్నా నేను చెక్కే రాసి యిచ్చేస్తాను. చిల్లర కర్చుకోసం ఏదో పాతిక నా దగ్గిర ఉంచుకొంటా ఇంకా నేను నయం! మా తాతగారికీ మా తండ్రిగారికీ రూపాయలు ఎలావుంటాయో తెలియదు. వాళ్ళ చేతులతో ఒక్క కానీ కూడా ఖర్చుపెట్టి ఎరగరు. ఆ అలవాటే నా కూనూ.

రాధా : పోనీ చెక్కే రాసివ్వండి

కైలాస్ : (టేబిల్ డ్రాయరు లాగి చూస్తాడు. అది రాదు. ఒరే గణేశ్! గణేశ్! వెధవ! వీడొకడు. ఎక్కడకు పోతాడో! పోనీ పోయే ముందు నా తాళాలు నా యెదాన కొట్టి పోగూడదూ!

రాధా : అదేమిటి తాతాజీ! తాళాలు నౌకరుకు యిస్తున్నారు?

కైలా : వాడ్ని నౌకరు అనడానికి వీల్లేదు. నా చిన్నతనమునుండి వాడు మా దివాణంలో పనిచేస్తున్నాడు. చాలా నమ్మకమైనవాడు. అసలు

యింతకూ నాదగ్గర రొక్కం అంటూ ఉంటేగా వాడు దొంగలాడ్డానికి? సరే వాడొచ్చిన తర్వాత చెక్కురాసి పంపిస్తాను. మరేం అనుకోకు నాయనా?

రాధా: అలాగే చెయ్యండి. మీ బాకి రెండు నెలల్లో తీర్చేస్తాను.

కైలా: రెండునెలలు కాకపోతే రెండు సంవత్సరాల తర్వాత యియ్యండి. ఎప్పుడు మీకు సావకాశం దొరికితే అప్పుడూ! నేను యిదివరకు చేసిన దానధర్మాల్లో యిదియేపాటి? మా నయంజారు మహారాజుల సంగతి మీకు పూర్తిగా తెలియ దనుకుంటాను. మా తాతగారు వారి హయాంలో చేసిన దాన ధర్మాలు లెక్కవేసి చూస్తే 3 కోట్ల రూపాయలకు పైబడిందట. అలాగే మా నాయనగారు హయాంలో కొన్నిలక్షలకు దిగిందనుకో.

రాధా: మీగురించి మీ తాతతండ్రుల గురించి మాకు తెలియందా బాబూ. మీరు యీ బీద రాధాగోవిండ్ మీద కాస్త దయ చూపించారంటే చాలు, బ్రతికి బయట పడుతాడు. మీకు నేనుఎంతో రుణపడి ఉంటాను. నా చర్మం తీసి మీకు చెప్పులు కుట్టిస్తాను.

కైలాస్: ఈ మాత్రానికే! మనిషికి మనిషి సహాయం చేయడం లోకధర్మం రాధాబాబూ.

రాధా: మరోగంట పోయిరానా?

కైలాస్: ఎందుకూ? రేపు మీ యింటికే పంపిస్తానుగా.

రాధా; మరి సెలవు యిప్పించండి (అంటూ వంగి పాదాలకి నమస్కరించి వెళ్తాడు. కైలాస్ వీధి తలుపు దగ్గరగా వేసి, ఒకసారి డ్రాయరు తీసి, చెక్కు పుస్తకం కళ్ళకు అద్దుకుని పెట్టేసి ఒక చుట్టతీసి వెలిగిస్తాడు)

కైలాస్: అమ్మయ్య! ఎలాగైతేనేం వదిలేడు (ఇంతలో)

జగన్నాథ్: తాతాజీ! తాతాజీ!

కైలాస్; ఓహో జగన్నాధబాబా! రా నాయనా రా!

జగ : నమస్కార్ ! తాతాజీ! కులాసాగా ఉన్నారా ?

కైలా : ఏదో యిలా ఉన్నాను. 80 యో పడిలో ఉన్నానా ? పోయే రోజులు కాని వచ్చేరోజులు కావుగా

జగ : అదేమిటి తాతాజీ ! ఇంతకూ ఆ రోజు రమ్మంటే వస్తుందా? వద్దంటే మానుతుందా ? మీలాంటి ధర్మదాతలు శత సంవత్సరాలు ఉండాలని ఆ జగన్నాథ ప్రభువుని కోరుకుంటూ ఉంటాను.

కైలా ; ఎందుకు నాయనా యింకా బ్రతకడం ? నా వయస్సుతోపాటే మా జమీందారీ భాగ్య భోగాలుకూడా చివరిదశకు వచ్చాయి. మా తాతలు తండ్రులు ఎంత హోదాతో బ్రతికారో నాకు తెలుసు. నా కళ్ళముందే అందరు జమీందారు చితికిపోయారు.

జగ : అవన్నీ పాతకాలపు కబుర్లు తాతాజీ ! ఇది ప్రజారాజ్యం అది ప్రభువుల కాలం !

కైలా : బాగా చెప్పావు. అది సరేగాని ఇన్నాళ్ళు ఎక్కడా కనబడలేదు. ఊళ్లో లేవా ?

జగ : లేను తాతాజీ ! గయలో సారస్వత సభ జరిగితే వెళ్ళాను. అక్కడి ప్రజలు నాకు సన్మానం జరిపారు.

కైలా : పూర్వం మీలాంటికవులు మా ఆస్థానాల్లో కవులుగా ఉంటూ ఉండేవారు. రాజుల్లాగే రాజకవులుండేవారు. చక్రవర్తుల్లాగే కవిచక్రవర్తులుండేవారు. సమ్రాట్టుల్లాగే కవిసమ్రాట్లు లుండేవారు. ఏదీ యీనాడు కవులకు పోషణ! జమీందారులు పోయారు కవులు నశించి పోయారు.

జగ : అలా అనకండి కైలాస్ బాబూ ! ప్రపంచ మున్నంత కాలం కవులుంటూనే ఉంటారు. మేమంతా ప్రజా కవులం ప్రజాభ్యుదయ కవులం. పూర్వ కవులంతా శృంగార కవులు.

కైలా ; సరేకాని గయ వెళ్ళావు గదా ! ఈ తాతకోసం పుణ్యం ఏమాత్రం మూట కట్టుకొచ్చావో చెప్పు.

జగ: పుణ్యం ఎందుకు తాతాజీ! పుణ్యం చేసుకుని స్వర్గానికే గదా వెళ్తారు. అలాగ స్వర్గానికి తీసుకుపోయేటంత ఘాటయిన పొగాకును మీకోసం తెచ్చాను తాతయ్యా?

కైలా: తెచ్చావూ! నామీద నీకెంత దయ ఏదీ ఏరకం తెచ్చావో చూడనీ!

జగ: ఇదిగో (అంటూ పొగాకు మూటయిస్తాడు.)

కైలాస్: (పొగాకు కాడ ఒకటి తీసి వాసనచూసి) భేష్! మేలైనరకమే! కాదనడానికి వీలులేదు.

జగ: ఒకచుట్ట కాల్చి చూడండి!

కైలా: ఇప్పుడే కాల్చాను. ఇదివరకటిలా ఎక్కువగా కాల్చడంలేదు. ఇదివరకు అంటే ఆ రోజుల్లో రోజుకు కనీసం 4 డజన్లు కాల్చేవాడ్ని. ఆ రోజులు పోయాయి. ఇప్పుడు ప్రోగ్రాం ప్రకారం రోజుకు మూడు కాలుస్తున్నాను. ప్రస్తుతం నా జీవితమంతా టైమ్‌టేబిల్ ప్రకారం నడవ వలసిందే. ఆ రోజుల్లో అంటే బ్రిటిష్‌వారి హయాం రోజుల్లో తరచు మా దివాణానికి కలక్టర్లు, గవర్నర్లు—అంతా దొరలు—వచ్చేవారు. వారికి మనదేశం పొగాకు నచ్చేదికాదు. అందుకని ప్రత్యేకంగా వర్జీనియా పొగాకు తెప్పించేవాణ్ని ఆ రోజులన్నీ కలలుగా కథలుగా యిప్పుడు మనం చెప్పుకో వలసిందే!

జగ: ఔను! ఆ వర్జీనియా పొగాకు గురించి ఎవరో చెప్పగా విన్నాను. చాలా కమ్మగా ఉంటుందిటగా!

కైలాస్: ఎవరో చెప్పగా విన్నావూ? నేను స్వయంగా కాల్చి, రుచి చూశాను. ఎంత మజాగా ఉండేది ఆ పొగాకు చుట్ట! ఒకదమ్ము లాగి పొగవదుల్తూ ఉంటే ఎటువంటి ఆలోచనలు కలిగేవి! ఎంతటి క్లిష్టసమస్యలనైనా యిట్టే పరిష్కరించే వాడ్ని.

(సశేషము)

వ్యాసము :

# రామాయణ కల్పవృక్షం

## "ఉత్తర కుమార ప్రతిజ్ఞ"లు పట్టి సాధించిందేమిటి ?

వాఙ్మయ మహోద్యమ
శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

విశ్వనాథ వారూ ! చౌదరిగారు మీ రామాయణం మీద విమర్శలు వ్రాస్తున్నారు. వారు తప్పులే్న తప్పులంటున్నారో ఒప్పులే్న తప్పులంటున్నారో తెలిసి కోడానికి ఆ వ్యాసాలు మీరు చదివారా ? అసలు మీరు భారతులు చూశారా ? మీరు మద్రాసులో చెప్పిన మాటలు, చివరికి ఆంధ్ర పత్రికలో వ్రాసిన మాటలు, కొన్ని చూస్తే మీరు అసలు ఆ పత్రికల వైపే చూడరని అర్థమవుతుంది. "ఒక వ్యాసం కూడా నేను చూడలేదు. ఇంత దూరం వచ్చింది కనుక తీరిక లేకపోయినా మీరు వ్రాసిన వ్యాసాలు చదువుతాను" అని మీరు మొన్న ప్రతికలో వ్రాశారు. ఆ వ్యాసాలు మీరు చదవ లేదనే విషయం స్పష్టం. మద్రాసులో మీరు మాట్లాడుతూ కొత్త సత్యనారాయణ చౌదరి గారు రామాయణంలో ఉన్న తప్పులంటూ చూపించినవి తప్పులు కావని ఆయన తప్పులన్న వాటికన్నిటికి సూత్రాలో, శాస్త్రాలో ప్రయోగాలో చూపిస్తానని చెప్పారు. వారి వ్యాసాలు చదవకుండానే వారు తప్పులే్న తప్పులన్నారో ఒప్పులే్న తప్పులన్నారో తెలిసి కోకుండానే అంతటి మాట మీరెట్లా అనగలిగారు ? "కొత్త" వారు ఒప్పులైన వాటిని కూడా కొన్నిటిని తప్పులన్న మాట నిజమే. తప్పుల్ని కూడా వారు తప్పులుగా చూపించారు. యామిజాల పద్మనాభస్వామి గారు "కొత్త" వారు తప్పులన్న వాటిని ఒప్పులుగా నిరూపిస్తానని ప్రతీ దాన్ని ఒప్పుగానే నిరూపిస్తానని మీ ఎదుటా, అనేక మంది పెద్దల ఎదుటా ప్రతిజ్ఞ

పట్టారు. ఆ ప్రతిజ్ఞను మీరు ఖండించలేదు. సరికదా "కొత్త" వారు చూపినవి తప్పులు కావు అని మీరూ అన్నారు. మీ భక్తుడైన పద్మనాభ స్వామి కాదు అసలు పద్మనాభ స్వామి వచ్చినా, ఈ విశ్వనాథుడు కాడు అసలు విశ్వనాథుడే దిగివచ్చినా—మీరేదో బ్రహ్మ సంగతి కూడా ఎత్తారే—ఆ బ్రహ్మ కూడా దిగివచ్చినా ఒప్పు అని నిరూపించ లేని తప్పులు మీరు వ్రాశారు. అటువంటి తప్పుల్ని కూడా చౌదరిగారు చూపించారు. అయినప్పుడు మీరూ మీ భక్తులూ పట్టిన ప్రతిజ్ఞలు కుమార ప్రజ్ఞలు కావు. ఉత్తర కుమార ప్రతిజ్ఞలు. పట్టి పట్టి ప్రతిజ్ఞలకేం వచ్చింది. కాని పత్రికలు మీకై మీరు చూడనట్లూ ఎవరో తీసుకు వచ్చి ఏదో చూపించినట్లూ—పూర్వ కాలంలో కళ్ళు నెత్తిన పెట్టుకొన్న మహారాజులనో మహా మహా రాజులనో ఆదర్శంగా పెట్టుకొన్నట్టు మాట్లాడతారేం? మీరెంత అలౌకికులండీ? ఇక్కడ "అలౌకిక" శబ్దాన్ని "తెలివి తక్కువ" అనే అర్థంలో నేను వాడ్డం లేదు లెండి" లోకంతో సంబంధం లేని " అనే అర్థంలో వాడుతున్నాను. పత్రికలు చూడనట్లు మాట్లాడ్డం, చూడకపోవడం, ఒక రకంగా మీ దుర్గర్వానికి, మరొక రకంగా, మీ తెలివి తక్కువ తనానికి చిహ్నం. మీ మీదవచ్చే విమర్శలే మీరు చూచు కొనక పోతే ఇక మీరు చూచేదేమిటి, వ్రాసే దేమిటండీ? మీ పుస్తకాల్లో తప్పులు మాట అటుంచండి. "తమరు కూడా ఏవో పుస్తకాలు వ్రాశారని వినికిడి. మీరు ఏవి దోషాలన్నారో అవి మీ గ్రంథాల్లో నే. చూపించవచ్చు. మీ సవాలు అట్లా ఉంచి ఇది నా సవాలు. ఆ సభ పెట్టించండి మీ పటం పెట్టి మీ నెత్తినే పొడుచుకున్నట్లవుతుంది. నాకేమీ అభ్యంతరం లేదు." అని మీరు చౌదరిగారి నుద్దేశించి వ్రాశారు. ఇది కూడా ఉత్తర కుమార ప్రతిజ్ఞే. "రాఘవేశ్వరు గృహముల్" అన్నప్పుడు యతి భంగమున్నదని చౌదరి గారు చూపిస్తే నిజమేనని మీరు తల వంచక తప్పలేదు. ఈ ఒక్క తల వంపుతో సరిపోయిందని మీ రనుకోవటం పొరపాటు. జారుకోకుండానే మీరు నిలబడితే ఈ విధంగా అనేక సార్లు తల వంచ వలసిన పరిస్థితిలో ఉన్నారు. ఈ యతుల విషయంలో రెండు మూడు సార్లు కాదు, ఒక్కసారైనా చౌదరి గారి చేత మీరు తలవంపించ లేరు. పుస్తకాల మొహమైనా చూడక మేకపోతు గాంభీర్యపు ప్రతిజ్ఞలు పట్టే మిమ్ములను

గురించి మాకు బాగా తెలుసు. మీరెప్పుడు తెలుసుకొంటా రండీ మిమ్మల్ని ? "బ్రహ్మదేవుడైనా తప్పులు లేకుండా వ్రాయలేడు, నేనూ తప్పులు వ్రాశాను. మహాకవి భారవిలోను, మహా పండితుడు కాళిదాసులోను తప్పులు ఉన్నాయి." అని మీరన్నారు. చౌదరి గారు చూపించిన తప్పులు తప్పులు కావనే విషయం అట్లా ఉంచుదాము. ఊరికే వాదం కోసం చౌదరి గారు వ్రాసినవి తప్పులు కావనే అను కొందాం. కాని చౌదరిగారు వ్రాయకుండా విడిచి పెట్టిన తప్పులు పెద్ద పెద్ద తప్పులు మీ రామాయణ కల్పవృక్షంలో చాలా ఉన్నాయి. గత సంవత్సరం వరంగల్లులో మాట్లాడుతూ మీరు-"నాది రామాయణ కల్పవృక్షం. మంచి కావాలంటే మంచి దొరుకుతుంది. చెడు కావాలంటే చెడు దొరుకుతుంది. కామ ధేనువు వంటిది నా కావ్యం. ఎవరికి ఏది కావాలో అది ప్రసాదిస్తుంది." అనే ధోరణిలో మాట్లాడారు. ఏదో అలంకారార్థం మాట్లాడిన ఈ మాటల్లో గొప్పతనం ఉందనుకొని పప్పులో కాలేశారు. సమస్తమైన దోషాలకూ మీ కావ్యం ఆటపట్టని మీరే ఒప్పుకొన్నారు. గుణాల మాటంటారూ, క్రమంగా ఆ గొప్పతనం ఏ రూపంలో ఉందో నేనే చూపిస్తాను. మీ రామాయణంలో తప్పు లున్నాయని చౌదరి గారు చూపినవి తప్పులు కావనడంలో ఒక రకంగా విశేషం ఉన్నా తప్పులు వ్రాశాను "అని మీరంగీకరించడంలో ప్రత్యేక విశేషముంది. ఆత్మరక్షణార్థం ముందే కవచ ధారణచేసినందుకు మిమ్ములను మెచ్చుకొంటున్నాను. భారవి కాళిదాసు తప్పులు వ్రాశారంటే గతిలేక వ్రాశారు. గతిలేక తప్పులు వ్రాయడమనేది అతి విరళంగా జరుగుతుంది. కాని మీరు వ్రాసిన తప్పులు గతిలేక వ్రాసినవి కావు-రజస్తమోగుణాల ప్రకోపంలో మతి లేక వ్రాసినవి., భారవి, కాళిదాసాదుల దోషాలు వేళ్లమీద లెక్క పెట్ట దగ్గవి. మీ రామాయణంలోని దోషాలు లెక్కపెట్టి చెప్పడ మెందుకు ? అతిశయోక్తి అయినా మీరు చెప్పుకొన్నట్లే కల్పవృక్షం-కల్పవక్షం ఎన్ని రకాల కోరికలు కోరుకొన్నా తీరుస్తుంది. అట్లాగే మీ రామయణ కల్పవృక్షం ఎన్ని రకాల తప్పులు కావాలను కొన్నా ప్రసాదిస్తుంది, మతి లేక వందలాది తప్పులు వ్రాసిన మీరు అగతికంగా తప్పులు వ్రాసిన భారవి

కాళిదాసాదుల శ్రేణిలోకి చచ్చినా చేరలేరు. సరిగదా, బ్రహ్మశ్రేణిలోకి వెయ్యి జన్మ లెత్తినా చేరలేరు. చౌదరి గారు తప్పులంటూ చూపించిన వాటిని తప్పులు కావు ఒప్పులే అని నిరూపిస్తా" అని మీరూ మీ భక్తులూ ప్రతిజ్ఞ పట్టారు. చౌదరి గారే చూపించిన ఒక యతిభంగానికి, మీరు తల వంచటం జరిగింది. ప్రతిజ్ఞా భంగం అయిపోయింది. ఒకసారి ఉత్తర కుమారులయ్యారు. ఒక మెట్టు దిగివచ్చారు. "దిగు దిగు నారా! దిగరానారా!" అని ఒకళ్ళు దింపకుండానే ఇంకా మీకై మీరే దిగక తప్పదు. దిగితీరుతారు. భ్రాజిష్ణు, (వా) ల్మీకి— వంటి యతిభంగాలు చౌదరిగారు చాలా చూపించారు. ఇట్లాంటివి ఎన్ని ఉన్నాయో అన్ని సార్లు మీరు ఉత్తర కుమారులవుతారు.

ఇంక మీరు సవాలు చేసిన "చిద్గగన ప్రాలేయ" విషయం చూదాం. సమర్థించుకొడానికి అవకాశం ఉన్నది కదా అని దీన్ని పట్టుకొని "ఇది తప్పని నిరూపించండీ? ఇది తప్పని పండితులంటే చౌదరి గారు తప్పులే చూపించారని నేను తప్పులే వ్రాశానని అంగీకరిస్తానని, ఇది తప్పుకాదు ఒప్పేఅని పండితులంటే చౌదరి గారు అపండితుణ్ణి అని అంగీకరించా"లనే ధోరణిలో మీరు వ్రాశారు. ఈ సందర్భంలో మీరు "చావు తెలివి" ఉపయోగించారు. ఒకడికి జబ్బొస్తుంది. ఇవాళో రేపో చస్తాడని అందరూ భయపడుతూ ఉంటారు. ఆ రోగికి హఠాత్తుగా తెలివి వస్తుంది. ఎప్పుడూ మాట్లాడనంత తెలివి తేటలతో మాట్లాడతాడు. ఇక బతికి పోయాడు, చచ్చి పోడని ఇంట్లో వారంతా సంబరపడుతూ ఉంటారు. కొంతసేపటికి ఉన్న ప్రాణాలున్నట్లు ఎగిరి పోతాయి. అప్పుడు గాని తెలియదు "అది చావు తెలివి" అని ఆ సంతోష పడిన వారికి—ఇట్లాంటి చావు తెలివినే ఉపయోగించారు మీరు. "ప్రహ్రేవా" అని, పింగళ సూత్రమూ— "భవేదాద్వస మానేపి రేఫ యోగాత్ పదం తథా" అంటూ అధర్వణాచార్యులది అనబడే ఒక కారికా ఉన్నదనేగా మీరీ సవాలు చేశారు. అయ్యా! సత్యనారాయణ గారూ! నన్నయ్యా తిక్కన్నా మిమ్మల్ని ఆవేశించారనీ వాళ్ళు పోయిన మార్గంలో మెరుగుల్ని తీర్చిదిద్దుతూ వ్రాస్తానని మరో ఉత్తర కుమార ప్రతిజ్ఞ పట్టారే మీ రామయణంలో నన్నయ తిక్కనలు భారతంలో

ప్రపూర్వకంగానే లఘుప్రయోగం చేశారు. పింగళ సూత్రాన్నే అనుసరిం చారు. అంతకు మించి వేరే ప్రయోగాలు వాళ్లు చేయలేదు. ప్రహ పూర్వ కంగా, లఘు ప్రయోగం కళాపూర్ణోదయంలో ఉన్నదని అహోబలుడు అన్నాడు కాని అది నేడు కన్పడ్డం లేదు. మీరు ప్రప్రాలనే కాక క్ర, గ్ర త్ర, బ్ర, అనే అక్షరాలను గూడ స్వీకరించారు. అధర్వణ కారికను ఆశ్ర యించారా స్వామీ! భాగవతాది ప్రయోగాలను ఆశ్రయించారా? నన్నయ తిక్కనలు అధర్వణ కారికను ఆశ్రయించలేదే! పద్దెనిమిది పర్వాల మహా భారతంలో నన్నయ తిక్కనలు మహా అయితే నాలుగు ప్రయోగాలు కూడా చేయలేదు. నన్నయ ఒకే ఒక ప్రయోగం చేస్తే తిక్కనలో రెండ వది కన్పడ్డం కష్టంగా ఉన్నది. మీరెన్ని ప్రయోగాలు చేశారో మీకు నేను చెప్పాలా! సూత్రాలు ప్రయోగాల సంగతెందుకు కాని, సమర్థించుకోటా నికి అవకాశ ముంది గదా అని ఈ ప్రయోగాన్ని పట్టుకొని సవాలు చేయ టంలో ఔచిత్యం లేదు. "రాఘవేశ్వరు గృహముల్" అన్నప్పుడు యతి భంగం జరిగిందని మీరు అంగీకరించక తప్పదు కాబట్టి ఆ ప్రయోగాన్ని ఎత్తి చూపించి-"ఇందులో యతి తప్పలేదు" అని ఆ తుమ్మల, ఆ వెంప రాల, ఆ వేలూరి గారల చేతనే చెప్పించండి. "మీరు తప్పులు వ్రాయలేదు. ఒప్పులే వ్రాశారు" అని అంగీకరిస్తాను "అక్కడ యతి తప్పింది" అని ఆ ముగ్గురూ చెప్పితే మీరు అపండితుణ్ణి అని ఒప్పుకోండి-అని చౌదరి గారు మీ మీద సవాలు చేశారనుకోండి. ఇటువంటి సవాలులో ఎంత ఔచిత్యం ఉన్నదని మీరూ నేనూ అనుకుంటామో అంత ఔచిత్యమే మీ సవాలులో కూడా ఉంది.

"మీరు ప్రధానంగా చెయ్యవలసింది చిగ్గగనాంతమందు గురువుని చూపించడం, మీరు ధర్మచింతా పాపభీతి కలవారు గనుక గురు దర్శనం మీకుతప్పకుండా జరుగుతుంది. లఘుదర్శనం కలుగుతుందా"అని చౌదరిగారి నుద్దేశించి మీరు వ్రాశారు. సత్యనారాయణగారూ! మీరు వృద్ధులయ్యారు. "వృద్ధుల బుద్ధులు స చరింపవే" అన్న భారత వాక్యానికి లక్ష్యభూతులుగా కూడా తయ్యారయ్యారు. వెక్కిరింపులూ, కొక్కిరింపులూ ఎందుకండీ?

"తాడిని తన్నేవాడుంటే వాడితలను తన్నేవాడుంటా"డని సామెత మీరు వినలేదూ? నన్నయ మొదలు చిన్నయవరకే కాదు. మీ మీద విమర్శలు వ్రాస్తున్న చౌదరిగారి వరకూ కూడా సంయోగానికి పూర్వంలో లఘువు గురువు కావడమే తరచుగా కాదు చాలా ఎక్కువగానే కన్పిస్తుంది. ఎంత పాపభీతిఉన్నా నన్నయాదులు తమకు తెలియకుండా ఏమి పాపంచేశారో! ఒకటిరెండుసార్లు మాత్రం సంయోగానికి పూర్వం, లఘుదర్శనం చేశారు. మీరు ప్రత్యేకించి చేసుకొన్న అదృష్టం ఏమిటంటే సంయోగానికి పూర్వం తరచుగా మీకు లఘుదర్శనమే కావడం ప్రకృతి సిద్ధమైన గురుదర్శనం ఎందుకు అవుతుంది?

సత్యనారాయణగారూ! ఒకానొక భావకవిని "నీకు యతులొచ్చురా? ప్రాసలొచ్చురా?" అని ఏమేమో అడిగారట. రావడం అంటే ఏమిటండీ సత్యనారాయణగారూ?— "గోపాల కృష్ణయ్యా! నాకు చందస్సు వచ్చంటావా? రాదంటావా?" అని మిమ్మల్ని గురించి మీరే నన్ను ప్రశ్నిస్తే రెండువిధాలుగా సమాధానం చెప్తాను. ఒకవిధంగా వచ్చునని మరొకవిధంగా రాదని—అంటే ఏమిటో వివరించి చెప్పమంటారా? కవిత్వం వ్రాయడానికి గణ, యతి, ప్రాస, వృత్తాలు లక్షణ లక్ష్యజ్ఞానం ఎంతఉంటే సరిపోతుందో అంత ఉండడం రావడం అని. ఈ దృష్టితో మీకు ఛందస్సు వచ్చు. ఛందశ్శాస్త్రంలో ప్రత్యేకమైన ప్రరిశ్రమచేసి, పరిశోధనచేసిన గిడుగు సీతాపతి, నిడదవోలు వెంకటరావు, ఇది వ్రాస్తున్న గోపాల కృష్ణయ్య, రావూరి దొరసామి శర్మ మొదలైన వాళ్ళ దృష్టితో చూస్తే మీకు ఛందశ్శాస్త్రం రాదు" అని. ఛందశ్శాస్త్రంలో ప్రత్యేకమైన పరిశ్రమ చెయ్యకుండా. ఈ రెండువిధాలైన సమాధానాలూ వర్తిస్తాయి. కవిత్వం వ్రాయడానికి తగినంతగా ఆ భావకవికి ఛందస్సు రాదంటారా? ఆయన పద్యకవిత్వం వ్రాయడం తగ్గించుకొన్నందువల్ల మీరు నిత్యం వ్రాస్తున్నందువల్ల మీరు చదువుకొన్నది ఆ భావకవి కంటె ఎక్కువగా మీకు గుర్తుఉండి ఉంటుంది. తిక్కనాదుల ననుసరించి మీ రామాయణంలో సర్వ సామాన్యం కాని వృత్తాలు కొన్ని వాడారు తిక్కన్న వివిధ వృత్తాలు వ్రాసినందుకు మీరూ వ్రాశారు. అంతవరకూ బాగానే ఉంది. అయ్యా! సత్యనారాయణగారూ!

మీ రామాయణం బాలకాండలో "గజవిలసితము" అని పేరుపెట్టి ఈ క్రింది పద్యం వ్రాశారు.

చీకటు లివ్వికావు జిలుగు తళుకు జిగి
దంతా కృతి గానరాద యసలు నలుపుటిరుల్
గాకన గాళికావు కదలవు మెదలవు
ముందీ కరిరాజి లేద యిటు గున గున కదుపన్

ఇది అర్థసమ వృత్తమో విషమ వృత్తమో చెప్తారా! అర్థసమ వృత్తం కాదూ అని కనపడుతూనేఉంది. ఒకటి మూడు పాదాల్లో పదిహేను అక్షరాలున్నాయి. రెండవ పాదంలో పదహారు అక్షరాలున్నాయి. నాల్గవ పాదంలో పదిహేడు అక్షరాలున్నాయి. ఏవైనా మూడు పాదాలు మాత్రమే సమానంగా ఉండడం సామాన్య విషమ వృత్తలక్షణం, ఒకదానికి ఒక దానికి సంబంధం లేకుండా నాలుగూ వేరువేరుగా ఉంటే "సర్వవిష మం" అని పెద్దలు చెప్పారు. మీరు సృష్టించిన ఈ పద్యంలో మూడు విధా లైన వృత్త పాదాలున్నాయి. పూర్వులు చెప్పకపోయినా కొత్తరకమైన విషమ వృత్తం మీరు సృష్టించారని అనుకొందాము. దీంట్లో ప్రాసెక్క డుంది స్వామీ ? నాల్గవపాదంలో యతి ఎక్కడుంది స్వామీ?" ఇది అర్థ సమం కాదు. విషమ వృత్తమూ కాదు. దేశిఛందస్సులో వ్రాసి ఆ పేరు పెట్టాను. దేశి పద్యం కాబట్టి ప్రాసపెట్టలేదు" అని మీరు సమర్థించు కోడా నికి అవకాశం ఇస్తున్నాను. అయినప్పటికి నాల్గవ పాదంలో యతి సంగతి ఏమి టంటారు? మరొకమాట చెబుతాను వింటారూ? అసలు "గజవిలసితం" అనే పేరుతో ఒక వృత్తం ఉంది. మీకిది తెలియదు పాపం! భ,ర,న,న,న,గ— అనే ఈ గణాలుంటే "గజవిలసితము" అనే వృత్తముంటారని సంస్కృత ములో మందార మరందకర్తా, తెలుగులో సుప్రసిద్ధ ఛందశ్శాస్త్రకర్త అప్పకవీ, చెప్పారు. దీనికే పింగళుడు తన ఛందంలో "ఋషభ గజవిలసి తము" అనే పేరుతో లక్షణం చెప్పాడు. సంస్కృత ప్రాకృతాల దాకా ఎందుకు? అప్పకవీయం చూడండి చాలు. గజవిలసిత లక్షణం మీకే తెలు స్తుంది.

ప్రాచీనకాలంలో ముద్రణయంత్రాలు లేవు కాబట్టి ప్రతి పుస్తకాన్ని ప్రతి వాడూ చూడ్డం కష్టతరంగా ఉండేది. అందువల్ల ఎవరు ఏ కొత్త వృత్తాన్ని వ్రాసి ఏం పేరు పెట్టారో తెలుసుకోవడం కష్టమయ్యేది. కాగా ఎవ్వరో "ఉపస్థితం" అని పేరు పెట్టు కొన్న వృత్తానికే ఆ పేరు ఉన్నదని తెలియనందువల్ల అదే వృత్తానికి "శిఖండి విరుతం" అని ఒకరూ "శ్రీ వృత్తం" అని మరొకరూ "స్త్రీ వృత్తం" అని మరింకొకరూ పేర్లు పెట్టారు. ఇట్లాగే సుగంధికి శాలిని. చామర, ప్రశాంతులు అని బహు నామాలు వచ్చాయి. ఇట్లా ఒక్కొక్క వృత్తానికి ఒకటికి మించిన పేర్లు కొన్నిటి కేర్పడడం జరిగింది. ముద్రణ యంత్రాలు వచ్చింతర్వాత అనేకమైన ఛందశ్శాస్త్రాలు అచ్చు అయినవి. గజవిలసితమనే వృత్తం ఎక్కడో అప్రసిద్ధమైన ఛందశ్శాస్త్రంలో లేదు-సుప్రసిద్ధమైన అప్పకవీయంలోనే ఉంది. అయినా మీరు దాన్ని చూచుకో లేదు. తీరుతెన్నుల్లేని ఒక ఛందస్సును సృష్టించి "గజవిలసితం" అని పేరు పెట్టారు. అయినా "నీకు యతిప్రాసలు తెలుసట్రా. ఛందస్సువచ్చుటరా" అని ఒక భావకవిని అనగలిగారు. తెలియకుండా వ్రాసేదాని పేరు పాండిత్యం లేకపోవడం అనిమీరు వ్రాసినమాటను ఇక్కడ మీకే సమన్వయించుకోండి. మామూలు ఛందోవిషయాల విషయం కాదు గాని ప్రాస తత్వాన్ని, అక్షరప్రయోగ తత్వాన్ని తెలుసుకోవాలంటే పరిపూర్ణమైన ఛందశ్శాస్త్ర జ్ఞానం కావాలి. ఛందశ్శాస్త్రంలో పరిపూర్ణమైన జ్ఞానం ఉండాలంటే మంత్ర జ్యోతిశ్శాస్త్రాలను సైతం పరిశీలన చెయ్యాలి.

(సశేషము)

పుస్తక పరిచయము :

# సర్వోదయ గానము

రచన : ప్రకాశకులు

శ్రీ తుమ్మల సీతారామ మూర్తి

తెనుగు లెంక, అప్పికట్ల, బాపట్ల తాలూకా, గుంటూరు జిల్లా

వెల రూపాయి పావలా

సర్వోదయ సిద్ధాంతముల నాచరించుటలో శ్రీ వినోబా భావే చూపిన మార్గమును లక్షించి, ఆతని ప్రవచనములోని విశ్వకల్యాణ సూత్రములకు పద్య నిర్వచనమే ఈ గ్రంథరూపము. భావే ప్రవచనములను భావేచక్కట్లు గాను వారి కథలు పవిత్ర సన్నివేశములుగాను సీతారామ మూర్తి చిత్రించినారు. ఈయన మంచి కవి గొప్ప భావుకుడు. సర్వోదయ సిద్ధాంతముల నమ్మి బాపూజీ అడుగు జాడలలో మసలు కొన్న ఆదర్శజీవి. ఇట్టివారు సర్వోదయ గానము చేయుట ఎంతయో సముచితముగా నున్నది. దీనికి పీఠిక వ్రాసిన సహృదయులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు వచించి నట్టు లీ "సర్వోదయ గానమున' కవులనుగూర్చి చెప్పిన పదునెనిమిది చిన్న పద్యములు కవితా వ్యాసంగమునకు దిగిన వారందరును మంత్రములుగా జపింప వలసినవి. శ్రీ వినోబాభావేగారి ఉదాత్తాత్మ శ్రీ సీతారామమూర్తి చేతికి చిక్కి తెలుగు యెదుపులతో ఇందు మెఱయు చున్నది. తెనుగు పలుకు బడి తుమ్మల సీతారామమూర్తి గారికి తెలిసినంతగా వేరేకవికి తెలియదని కవి సమ్రాట్టులే కొండొకచో పేర్కొని యున్నారు. వేమన పద్యముల పోలిన సుద్దు లిందు ముద్దులు గురియుచున్నవి.

చదువు లేక గ్రుడ్డి బ్రదుకీడ్చు మానిసి
మందు లేక రుజుల గుందు పేద
కూడు లేక రాలువాడున్న గడ్డకు
శాంతి లేదు జీవ కాంతిరాదు

భావే చక్కట్లు దిద్ది తీర్చుటలో వీరి తెనుగు కలము బలిముగా బలికినది.

సుదతులు సూద్రులు వేదము
చదువంజన దనెడిపల్కు సైపను; నాకున్
జదురున్నది శ్రుతి విద్యన్
మదియున్నది దీని నేర్పిమనుజుల దీర్పన్

'పవిత్ర సన్నివేశములు' పేరున వీరు రచించిన గాథలు సత్యములై విబుధ జనస్తుత్యములై అలరారుచున్నవి. ఈ సర్వోదయ గానము-నేటి బాలబాలికలందరుచదువ దగిన పాఠ్య గ్రంథము వంటిది. సర్వోదయ తత్త్వమును చక్కగా విశదీకరించు సరస పద్య కావ్యము.

—శ్రీ వాత్సవ

## భారతమాత

మూల్యం
0-75 న.పై

రచయిత - ప్రకాశకులు
నీలి వెంకటేశ్వర్లు
హిందీ పండిట్ - జిల్లా
పరిషత్ ఉన్నత పాఠశాల, మాచెర్ల,
గుంటూరు జిల్లా

భారత దేశ విశేషమును, దేశనాయకులు కవులు, ప్రజల స్థితిగతులను గూర్చి కంద పద్యములలో రచింప బడిన భారత మాత అను మకుటము గల శతకము.

చెల్లే యిండ్లుగ, జనముల
తిల్లే దీవెనలటంచు—దిఱుగుచు, సతతం
బిల్లే మనియెడి, పేదల
పొట్లం దొలగింపుమమ్మ! భారతమాతా!

వంటినడకతో సాగిన పద్యములు నిందు గలవు.

పైడిపాటి సుబ్బరామ శాస్త్రి

# అమరుకము

రచన :

శ్రీ శంకర ప్రసాద్

కాకరపట్టు

ప్రకాశకులు :

లలిత కళాసమితి

వెల ఒక రూపాయి

ప్రసిద్ధ సంస్కృత చాటు పద్యకావ్యము అమరుకమునకు మరి యొక్క తెనుగుసేత. కృతికర్త, విద్వాన్ కవికిశోర శంకర్ ప్రసాద్ నిడుప్రోలు పి. బి. యన్ కళాశాలలో ఆంధ్రాధ్యాపకులు. కృతిభర్త ఆకళాశాలా వ్యవస్థాపకులు శ్రీ పాములపాటి బుచ్చినాయుడుగారు. ఈ గ్రంథమునకు కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రి తెనుగు వ్యాఖ్యానము చేసియున్నారు. దీనికి పూర్వమెన్నియో అనువాదములు వచ్చినవి. వానిలో తలమానికమన దగిన తాళ్లపాక తిరువేంగళనాథుని అనువాద ప్రశస్తి గూర్చి కవియే తన ప్రశస్తిలో తెలిపియున్నారు ఆధునికులలో వింజమూరి శివరామారావుగారి రచన మృదు మధురమైనది. ఇన్ని ఉండగా మరొక అనువాదము శ్రీ శంకర్ ప్రసాద్ చేపట్టి యీ కృతిగా ప్రకటించినారు. దీనికొక పీఠిక, ఒక పద్యాభివందనము, ఒక ప్రస్తావన, ఒక కృతి సమర్పణము కృతి స్వీకారము జతపరచి కేవల కృతిని 28 పుటలలో పొందు పరిచినారు. పద్యములన్నియు వృత్తములే. చక్కగా సాగిపోయినవనుటకు మచ్చుతునక మదగజ రాజ కుంభముల మచ్చరికించెడు చన్నుదోయి నోముదితరో! యేలదై కనిటు మూసెదనంచు ప్రియుండు విప్పబోనదను నెఱింగి తత్సజులు నంతదమంత, నెవో నెపాల, నా గదివిడి పోయి రాచలకు గాంతయు, గాంతుడు సంతసిల్లగన్ రికము'నకు 'ఇంచు'కాగమము చేయుట విడిచిపోయి అనుటకు విడిపోయి, అనుట ప్రయోగ విశేషములుగా గమనించ వచ్చును. కృతికర్త తెనుగు పండితుడగుట కవిత్వము కంటె పాండిత్యపు పాలు హెచ్చు ప్రకటించె నేమో!

—శ్రీవాత్సవ

## క్రేళ

సిద్దిపేట ప్రభుత్వోన్నత పాఠశాల, బేసిక్ ట్రైనింగు స్కూలు వారి వార్షిక సంచిక. తెలుగు, హిందీ, ఇంగ్లీషు, ఉర్దూ భాషలలోనే గాక సంస్కృతములో కూడా విద్యార్థులు వ్రాసిన రచనలతో శ్రీ రాజయ్య గారి ముఖ చిత్రంతో, సర్వాంగ సుందరంగా కళను వెలువర్చిన అధ్యాపకుల, విద్యార్థుల కృషి ప్రశంసనీయము. ఏడవ తరగతి విద్యార్థి శ్రీ ఆర్. మనోహర్ వ్రాసిన 'నృత్య బాలిక' చిత్రం బాగుంది.

—మహేశ్వర్

## గ్రంథ స్వీకారం

**అమృతపథం** — శ్రీ ఎం. హీరాలాల్ రాయ్

**తిక్కన చరిత్రము** — శ్రీ శిష్టా బాలకోటేశ్వరరావు

**వినోధిని** — శ్రీ రవీంద్రనాథ ఠాకూర్
అను:— వేదుల సత్యనారాయణశాస్త్రి

**కవీంద్ర కథ** — శ్రీ లీలా మజుందార్
అను:— శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు

**యోగాయోగాలు** — శ్రీ రవీంధ్రనాథ ఠాకూర్
అను:— శ్రీ సూరంపూడి సీతారాం

**గోరా** — శ్రీ రవీంద్రనాథ ఠాకూర్
అను:— శ్రీ శివశంకర స్వామి

**డైరీ ఉత్తరాలు** — శ్రీ కవికోకిల దువ్వూరి రామిరెడ్డి

## వార్తలు

## శ్రీకాకుళం హిందీ ప్రేమీ మండలికి ఆంధ్రప్రదేశ గవర్నర్

# భీమసేన్ సచార్

## రు. 100/ల విరాళం

ది. 15-12-1961 న ఆంధ్ర ప్రదేశ్ గవర్నర్ శ్రీ భీమసేన్ సచార్ శ్రీకాకుళం హిందీ ప్రేమీ మండలిని, హిందీ మహా విద్యాలయాన్ని సందర్శించిరి. దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ప్రేమీ మండలుల కార్యాకలాపాలను తెలుసుకొని తమ సంతోషాన్ని ప్రకటిస్తూ నూరు రూపాయల విరాళమొసగిరి.

మండలి అధ్యక్షులు శ్రీ రొక్కం లక్ష్మీ నరసింహం దొర M.L.A. కార్యదర్శి శ్రీ జి. కామేశ్వరావు అడ్వొకేటు, విద్యాలయ ప్రిన్సిపాల్ శ్రీ మంత్రిప్రగడ వెంకటరమణ, అధ్యాపకులు. శ్రీ సచ్చిదానందరావు గార్లు హిందీ ప్రచార కార్యక్రమాన్ని, స్థానికంగా తాము చేస్తున్న హిందీ ప్రచారాన్ని గురించి ఉపన్యసించిరి.

సాయంత్రం దక్షిణ భారత హిందీ ప్రచార సభ – ఆంధ్ర కార్యదర్శి శ్రీ లక్ష్మీ నారాయణ శర్మ గారు సభ హిందీ పరీక్షలలో ఉత్తీర్ణులైన వారికి ప్రమాణ పత్ర వితరణ చేసిరి.

## హిందీ ఉపన్యాస పోటీ

ది 1-12-61న హిందీ ప్రేమీ మండలి, అనకాపల్లి వారి ఆధ్వర్యమున తూర్పుగోదావరి, విశాఖ, శ్రీకాకుళం జిల్లాల అంతర్ ప్రేమీ మండలి

విద్యార్థుల హిందీ ఉపన్యాసపోటీ దక్షిణభారత హిందీ ప్రచారసభ. ఆంధ్ర కార్యదర్శి శ్రీ చిట్టూరి లక్ష్మీనారాయణ శర్మగారి అధ్యక్షతను జరిగినది.

ఈ పోటీలో ప్రథమబహుమతి రాష్ట్రభాషా విద్యార్థి శ్రీ కర్రి సత్యమూర్తి, మధ్యమ విద్యార్థి శ్రీ ఆదిభట్ల విశ్వేశ్వర రావుగార్లకు, ద్వితీయ బహుమతి రాష్ట్రభాష విద్యార్థిని కుమారి అయ్యగారి నాగలక్ష్మి మధ్యమ విద్యార్థిని కుమారి మంతా లక్ష్మి జ్యోత్స్న కళ లకు ఇవ్వబడినది.

గత ఆగస్టు 61లో హిందీ పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రమాణ పత్ర వితరణము శ్రీ కార్యదర్శిగారు చేసిన మీదట హిందీ ప్రేమీ మండలి కార్యదర్శి డాక్టర్ కోరుకొండ సుబ్బరాజుగారు ధన్యవాదములర్పించుచూ కీర్తిశేషులు తమ తండ్రిగారు కోరుకొండ బుచ్చిరాజుగారి పేర ఒక బహుమతిని-ఆంధ్రప్రదేశమున దక్షిణభారత హిందీ ప్రచార సభవారి రాష్ట్రభాషలో ఇకముందు ప్రతిసంవత్సరము ఫిబ్రవరి, ఆగస్టు పరీక్షలలో ప్రథములుగా ఉత్తీర్ణులైనవారికి దక్షిణభారత హిందీప్రచారసభ-ఆంధ. హైదరాబాద్ వారి ద్వారా యిప్పించు యేర్పాటు చేయబడినదని తెలిపి సభికులను ఆనందపరిచిరి. మిఠాయిలు పంచిపెట్టిన మీదట సభ సమాప్త మైనది.

## సభ పరీక్షలు

ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వము వారు. G.O. M.s. NO. 1576 ది.11-12-1961 లో దక్షిణ భారత హిందీ ప్రచార సభ ప్రాథమిక, రాష్ట్ర భాష పరీక్షలను ఆంధ్ర ప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషను వారి ఈ దిగువ సమాన మైనవిగా పరిగణించి యున్నారు. పబ్లిక్ సర్వీసు కమీషను వారి హిందీ ఆంధ్ర ప్రదేశ్

(1) ప్రాథమిక—థర్డ్ క్లాస్ లేంగ్వేజి టెస్టు

(2) రాష్ట్రభాష—ఆంధ్ర ప్రదేశ పబ్లిక్ సర్వీస్ కమీషను వారి హిందీ సెకండ్ లేంగ్వేజి టెస్టు (ఫుల్ టెస్ట్)

## హిందీ ప్రమాణ పత్రములు

గత ఆగస్టులో దక్షిణ భారత హిందీ ప్రచార సభ – ఆంధ్ర వారు జరిపిన ప్రాథమిక, మధ్యమ, రాష్ట్ర భాష పరీక్షలలో ఉత్తీర్ణులైన వారి ప్రమాణ పత్రములు 1962 జనవరి మొదటి వారంలో ఆయా కేంద్ర సంచాలకుల వద్దకు పంపబడును. పరీక్షార్థులు తమ తమ ప్రమాణ పత్రములను ఆయా కేంద్ర సంచాలకుల నుండి పొంద వచ్చును.

# महाकवि निराला के प्रति एक श्रद्धांजलि

श्री वाइ पुल्लय्याराव

नहीं हुआ है आज निराला जी का निधन
कहीं हुआ है आज महानतम उल्कापात।
आज यह वास्तव में निराला दिवस है
आज दो-दो सूरजों का हुआ अस्त है।
अब दुर्लभ हैं दर्शन के महाकवि के दर्शन
अब छाया मात्र हैं वे महान छायावादी।
'भिक्षुक' और 'विधवा' कविता वस्तुएँ हैं जिन की
वे महाप्राणी निराला हैं महामानव ही।
मुक्त छन्द के प्रथम प्रवर्तक महासाहसी
मुक्त हुआ है इस धरातल के बन्धनों से।
जब तक हिन्दी जीवित रहेगी इस जग में
तब तक आपकी अमरता बनी रहेगी।
ज्यों-ज्यों हिन्दी की दीप्ति की व्याप्ति होगी
त्यों-त्यों आप को सुकीर्ति भी प्राप्त होगी।
हे महाकवि! ले लो हमारी श्रद्धांजलि
हे महात्मा दे दो शत शत आशीर्वाद।

———

(निबन्ध)

# आन्ध्र के अमर कहानी कार.

तेलुगु लेखक :
श्रीं गोर्रेपाटि वेंकट सुब्बय्या

अनु :
'अहल्या रामकृष्ण'

(आन्ध्र साहित्य क्षेत्र में "अक्षराभिषेकम्" एक विशिष्ट आलोचना ग्रन्थ है— जिसमें आन्ध्र के लब्द प्रतिष्ट छः कहानीकारों के बारे में विस्तृत रूप से आलोचना की गयी है। इसकी रचना तेलुगु–बोल-चाल की सरल भाषा में सुविख्यात आलोचक श्री गोर्रेपाटि वेंकट सुब्बय्या ने की है। प्रस्तुत निबन्ध उसी में से एक का संक्षिप्त रूपान्तर है —संपादक।)

## (१) "करुण कुमार"

"किसी कवि या कहानीकार का यश उनके साहित्य के परिणाम के हिसाब से नहीं होता– गुण के हिसाब से होता है" इस दृष्टि से देखें तो हमें विदित होता है कि आन्ध्र साहित्य क्षेत्र में सिर्फ़ करुण कुमार ही एक ऐसा लब्द प्रतिष्ट कहानीकार है— जिसने दो-चार ही कहानियों की रचना करके अनुपम ख्याति पायी है।

आन्ध्र साहित्य क्षेत्र में उन्हें समुन्नत स्थान प्राप्त हुआ है। इसका मूल कारण तो हम यों बता सकते हैं कि हिन्दी के सुविख्यात कहानीकार प्रेमचन्द की भान्ति करुण कुमार भी एक आदर्शवादी कहानीकार है। उन्होंने अपनी कहानियों में मानव जीवन की वास्तविकता को आदर्शात्मक रूप में उपस्थित किया है। अलावा इसके उनके सभी पात्र हम अपने आस-पास के समाज में कहीं न कहीं कभी न कभी देख सकते है। मतलब यह है कि उन्हों ने जिन "पात्रों" का सृजन किया है— उनका चित्रण करने में यथार्थवाद से प्रेरणा ग्रहण

की है। इसी कारण से हम उनके पात्रों के हँसने के साथ हँसते हैं–रोने के साथ रोते हैं।

"एक विद्या सुरक्षिता" के अनुसार उन्होंने कहानी क्षेत्र में ही अपनी सारी शक्ति लगा दी है।

आपका जन्म पश्चिम गोदावरी जिले में हुआ था; और आज तक आप एक सर्कारी कर्मचारी हैं। इसी वजह से आपके जीवन के बारे में अधिक नहीं कहा जा सकता।

आन्ध्र साहित्य में लब्दप्रतिष्ट साहित्यकार श्री उन्नव लक्ष्मी नारायण का लिखा हुआ "मालपल्ली" (हरिजन बस्ती) पढ़ने के बाद आप कहानी क्षेत्र की ओर उन्मुख हुये है। तभी से कहानी रचना करने का विचार आपके मन में पैदा हुआ था। इस विचार धारा को विकासोन्मुख करने में "श्री मल्लंपल्ली" का बड़ा हाथ था। आपकी कहानियों में ग्राम्य जीवन का स्वास्थ चित्रण प्राप्त होता है। शायद यह कहना अनुचित न होगा कि प्रेमचन्द की भाँति दलित मानव जाति के प्रति सहानुभूति रखते हुये जीवन की कटु वास्तविकता का स्वास्थ चित्रण करने में आप सिद्धहस्त कलाकार है। जाति के अंतर्गत प्राचीन रूढियों को तोड़ कर जरूरत के अनुसार नवीन भावनाओं का स्वागत करने वाले आधुनिक कहानीकारों में आपका महत्वपूर्ण स्थान है।

कहानी साहित्य :—महात्मा गान्धी जी के पहले प्रायः सभी राजनैतिक नेताओं की दृष्टि बहुत संकुचित थी। उनकी दृष्टि में गरीबों की कोई अस्थित्व ही नहीं थी। शहरों में जिंदगी बिताते हुये; ग्राम्य जीवन को वे तुच्छ समझते थे। जब गान्धी जी ने राजनैतिक क्षेत्र में पदार्पण किये थे, तभी से इस क्षेत्र में बहुत बड़ा परिवर्तन होने लगा। ग्राम्य जीवन के बारे में गान्धी जी ने एक बार कहा कि "भारत की माली एक विशाल 'गाँव' है। की माली एक किसान है। इसलिये, हम किसान-मजदूरों की जितनी सेवा करते हैं उतनी ही अपनी मुल्क की तरक्की होती है।"

इस तरह गान्धी जी और उनके आदर्शों को सम्मुख रखते हुये प्रेमचन्द ने जितना सहज (वास्तविक) साहित्य का सृजन किया था; उसी तरह आन्ध्र साहित्य क्षेत्र में करुण कुमार ने भी विशिष्ट साहित्य का सृजन किया है ।

करुण कुमार के पहले ऐसा कोई कहानीकार नहीं है—जिसने अपने साहित्य में ग्राम्य जीवन को मुख्य स्थान दिया हो । साहित्य में खासकर कहानियों में ग्राम्य जीवन को मुख्य स्थान देने का श्रेय सिर्फ करुण कुमार को ही प्राप्त हुआ है । उनकी कहानियों में जमींदारों की हिंसात्मक क्रियायें तथा पूँजीपतियों की जबर्दस्ती, उच्च जातियों की नैच्यता आदि ज्यों का त्यों उपस्थित किया गया है पर कहने की जरूरत इस बात की है कि करुणकुमार क्राँतिकार नहीं है । मगर मानसिक परिवर्तन लाना ही उनकी कहानियों का ध्येय रहा ।

ग्राम्य जीवन की समस्याओं को सुलझाने का यत्न वे कदापि नहीं करते । पर उन समस्याओं तथा उस जनता की दुखद स्थिति का ज्यों का त्यों समाज के सम्मुख उपस्थित करतें हैं । इस कार्य की सफलता के पश्चात् पाठक के मन में सहानुभूति जरूर पैदा होती है ।

प्रेमचन्द की भाँति करुण कुमार की कहांनियाँ भी अक्सर घटना–प्रदान होतीं हैं । उनकी कहानियों में अश्लीलता, असभ्यता नाम मात्र को ही नहीं मिलती । सब लोग उनके साहित्य का अध्ययन करके उनके अंतर्गत समस्याओं तथा सौंदर्य को अच्छी तरह समझ सकते हैं ।

अलावा इसके उनकी कहानियों का और एक विशिष्ट लक्षण यह है कि वे जिस प्रांत के "पात्रों" (व्यक्ति) का चित्रण करते हैं–उसके साथ उसी प्रांतीय भाषा का प्रयोग करते हैं । मानव सहज भावनाओं का चित्रण करने में वे एक सिद्धहस्त कलाकार है— यह तो बेशक की बात है ।

चरित्र चित्रण, कथा-वस्तु, और पात्र-चित्रण आदि विषयों में वे अपने ढंग का निराला है । ठीक उसी तरह कहानी का प्रारंभ, विकास तथा चरमसीमा आदि का निर्वाह करने में भी वे बडे अनुभवी हैं ।

इसी वजह से पाठक कहानी के आरंभ से अंत तक पढे बिना रह नहीं सकता ।

उनकी कहानियों में "आकलि मंटलु" (भूखी ज्वालाएँ) एक विशिष्ट रचना है । इस कहानी में हमारे देश की दुखद स्थिति क स्पष्ट चित्रण किया गया है । अलावा इसके गरीबों के प्रति अमीरों की उदासीनता का भी सहज रूप से चित्रण किया गया है ।

"कोत चेप्पुलु" (नये जूते मनोवैज्ञानिक सिद्धांतों के आधार पर लिखी गयी अमूल्य रचना है । इस कहानी में क्रिया-प्रतिक्रिया का स्पष्ट चित्रण प्राप्त होता है ।

"वेंकन्न"– आन्ध्र कहानी साहित्य में इसका महत्वपूर्ण स्थान है । अपने गाय बैलों को बाल-बच्चों की तरह परवरिश करने वाला एक किसान की जिंदगी इसमें चित्रित किया गया है । 'वेंकन्न' उस बैल का नाम है—जिसके सहारे एक किसान अपनी आजीविका चलाता रहा । गरीबी के कारण किसान की जिंदगी में कितनी घटनाएँ घटी हैं; और उस बैल की क्या स्थिति हुई– इसकी मार्मिक वेदना का सहज चित्रण इस कहानी में प्राप्त होता है । शायद यह कहना अनुचित न होगा कि शरत्बाबू की लिखी हुई 'महेश' और प्रेमचन्द की "गोरा" इसी तरह की कहानियां हैं ।

"पेंड्लि मुच्चटा" (शादी की बातें) ग्रामीण पारिवारिक कहानियों में यह भी एक विशिष्ट रचना हैं ।

"सन्मानम्" (सम्मान) शीर्षक कहानी में एक मामूली अध्यापक अपने से बड़े अधिकारियों को सम्मान करने जितनी मुसीबतों का सामना करता है—उसका यथार्थ चित्रण इस कहानी में उपलब्द होता है । तत् पश्चात् "पोलय्या" एक ऐसा व्यंग्य रचना है— जिसमें हरिजनोद्धार के लिये विस्तृत रूप से चर्चा की गयी है ।

"कूलि मनिषि" (मजदूर) इसमें किसान-मजदूरों की समस्याओं का स्पष्ट चित्रण प्राप्त होता है । "जाकी" नामी कहानी में एक जमींदार के जीवन का चित्रण किया गया है । उस कहानी में जमींदार

अपने प्यारे कुत्तों के लिए हर साल चालिस हजार रुपयें खर्च करता है—वह सारा धन अपनी रियासती प्रजा से वसूल करता है। यदि इसका कोई विरोध करें—तो उसकी क्या दशा होती है—इसका वास्तविक रूप इस कहानी में प्राप्त होता है।

भाषा-शैली की दृष्टि से भी करुण कुमार को आन्ध्र साहित्य क्षेत्र में एक विशिष्ट स्थान प्राप्त हुआ है। आन्ध्र साहित्य लब्द प्रतिष्ट प्राचीन कवि श्री पालकुरिक सोमनाथ महाकवि ने पहले पहल बोल चाल की मधुर तेलुगु भाषा में अपनी कृतियों की रचना की थी। उनकी रचनाओं में "पंडिताराध्य चरित्र" और 'बसवपुराण" आदि विशेष रूप से उल्लेखनीय है।

इसके उपरान्त हमारे सामने चामकूर वेंकट कवि आते है—जिन्होंने जनता की मधुर तेलुगु भाषा में "विजय विलासम्" कृति की रचना की थी। तत् पश्चात् हमारे सम्मुख लब्द प्रतिष्ट गीतकार क्षत्रय्या तथा उन्नीसवीं शताब्दी के उत्तरार्ध में बोल-चाल की भाषा में रचना करने वाले अपन्यासकार "श्री उन्नव" आते हैं।

ठीक उसी तरह अपनी रचनाओं में (चाहे गद्य हो या पद्य) व्यवहारिक भाषा को मुख्य स्थान देने वालों में करुण कुमार का स्थान सर्वोपरि है। यदि अन्य लेखकों से तुलना की जाय; तो अंग्रेजी के थामस आर्टी और पंजाबी कहानीकार महम्मद की भांति करुण कुमार भी देश, काल, पात्रों का निर्वाह करने में सिद्धहस्त कलाकार हैं।

रस योजना :— करुणा और कवि इन दोनों के बीच में गहरा सम्बन्ध है। इसी दृष्टि से देखें तो वाल्मीकि ने अपनी कृति में "करुण रस" को ही मुख्य स्थान दिया है। तत् पश्चात् "एको रसः करुण एव" के अनुसार "भवभूति" ने "उत्तर रामचरित्र" की रचना की थी। ठीक उसी तरह आधुनिक कहानीकारों में करुण कुमार भी एक ऐसा कहानीकार है— जिसने अपनी रचनाओं में करुण रस को ही मुख्य स्थान दिया है।

उपसंहार :—समाज के अतंर्गत पीडित प्रजा के प्रति सहानुभूति रखते हुये उनके जीवन को विकासोन्मुख करने की ओर निरंतर ध्यान रखने वाले आधुनिक कहानीकारो में उनका स्थान महत्वपूर्ण हैं। वे कदापि न दूसरों की निन्दा करते, न औरों की प्रशंसा। पर भी, अपनी कहानियों में जीवन का वास्तविक चित्रण करते हैं, और उसके साथ-साथ समाजगत कमियों हमारे सामने उपस्थित करते हैं। इसका फलस्वरूप पाठक को जरूर सोचना पडता है। श्रेष्ट कहानीकारों का ध्येय यहीं होता है और होना भी चाहिये। लेकिन करुण कुमार में एक ही कसूर है कि वे लगातार कहानियों कि रचना नहीं करते। जब लिखने बैठते हैं—उसकी कलम से एक अच्छी कहानी जरूर निकलती है। उनकी रचना पढने पाठक हमेशा तरसते रहते हैं। कहानी साहित्य के जरिये प्रेमचन्द को जितनी ख्याति प्राप्त हुई—उतनी ही करुण कुमार को भी आन्ध्र साहित्य क्षेत्र में प्राप्त हुई है—यह तो सबों की मानी हुई बात हैं।

---

## हिन्दी-निबंध-प्रतियोगिता

गत वर्षों की भाँति इस वर्ष भी हिन्दी-साहित्य-परिषद्, हापुड़ की ओर से एक हिन्दी-निबन्ध प्रतियोगिता का आयोजन किया गया है। निबंध का विषय– **"राष्ट्रीय एकता का आधार हिन्दी"** है। यह निबंध ५०० से १५०० शब्दों तक का होना आवश्यक है। प्रथम, द्वितीय व तृतीय आने वाले प्रतियोगियों को क्रमशः स्वर्ण, रजत एवं रौप्य पदकों के साथ-साथ पुस्तकें एवं प्रमाण-पत्र भी दिये जायेंगे। इसके अतिरिक्त अन्य दो प्रतियोगियों को भी पुरस्कृत किया जावेगा। दो विशेष पुरस्कार अहिन्दी भाषा-भाषियों के लिए विशेषरूप से सुरक्षित हैं। निबंध भेजने की अंतिम तिथि ३१ जनवरी सन् १९६२ है। सभी निबंध **मंत्री, हिन्दी साहित्य परिषद्, हापुड** के पते पर भेजे जाने चाहिए। इस निबंध में विस्तृत जानकारी भी मंत्री-महोदय से की जा सकती है।

# कवि की निराशा

—श्री पी. आदेश्वरराव

यह भग्न प्रेम का अतुल भार
संतप्त हृदय के द्वारों से क्यों उमड़ चली है अश्रु-धार
जिस में अनन्त पीड़ा की लहरें उठती हैं क्यों बार-बार
कसक, वेदना और निराशा चुभते हे बनकर विषम शूल
इस जीवन-तरु के डालों मे मुरझाये सुख के तरुण फूल
मेरे मृदु मानस-लहरों पर छायी दुख-नीरद की छाया
जीवन-सर के अंतस्थल में दुख-नीरज ही मैं ने पाया
मेरे श्रान्त क्लान्त जीवन की यह कैसी प्राणों की पुकार
यह पीड़ा कैसी दुर्निवार!

यह जीवन-वन का भयद व्याल
जिस के विषमय दान्तों में है छिपा हुआ रे दंशन कराल
यौवन-सरिता में नाच रहा फन फैला के यह सर्प-काल
उस अतीत की मधुमय स्मृतियाँ पीड़ा से भर जातीं नितान्त
मेरे उर की भीषण ज्वाला भभक उठी है बन कर अशान्त
एक अनन्त वेदना अपनी काली छाया को डाल रही
अपूर्ण अभिलाषायें कितनी जीवन को जर्जर बना रहीं
संपूर्ण सृष्टि में आज एक दुख-मकडी ने है बुना जाल
यह कैसी दारुण विरह ज्वाल !

यह जीवन-तरु का पत्र जीर्ण !
इस स्वार्थी जगती को मेरे अनुराग त्याग बने संकीर्ण
जीवन-झरने की धारा में उपल बनीं आशायें अपूर्ण

मेरे मन-शिशु की अनन्त आकांक्षायें कभी न हुई शान्त
अंधकार में जुगुनू गण को मैं दौड पकडने चला भ्रान्त
जल राशि मानकर मृग-तृष्णा के पीछे सदैव पड़ा रहा
नेत्रों के सम्मुख शून्य क्षितिज अपना मुख केवल दिखा रहा
किन चेतनता की किरणों के आलोक पुंज से सृष्टि पूर्ण
यह जीवन कितना शुष्क-शीर्ण !

यह जीवन-जलनिध की तरंग
उठती है जो विकल भाव से कर मानव का अभिमान भंग
आँसू की छींटे उडती है छू कर वारिद के तुंग शृंग
मेरे मानस की करुण पुकारें दिक् दिगन्त को रही चीर
उर में पीड़ा जगती है ज्यों चुभ गया अचानक प्रखर तीर
प्रेम-सद्म का वास छोड़ कर क्या मैंने इस जग में पाया ?
भ्रान्त पथिक-सा भटक-भटक कर क्या मैंने जीवन-पथ-खोया ?
औरों के जैसे मैं भी क्या बदलूँ नित कितने नये रंग ?
पर रिक्त हुआ जीवन- निषंग !

यह जीवन मेरा चिर अशान्त
अविरत उंठती मानस-लहरों-से हृत्कम्पन का रे न अंत
अवशिष्ट रह गयीं आज यहाँ मधु पीड़ा की घडियाँ अनन्त
फट पड़ा मैं क्रन्दन रव में शत-शत भावों में हो विभोर
इस जीवन निशीथ के तम में लीन हुए कितने रुदन-रोर
किन लोगों पर विश्वास करूँ ? किन से मैं हो जाऊँ विरक्त ?
इस उलझन में पढ़ने पर भी डर मेरा नित अनुराग सिक्त
जग-मानव के मूल्यांकन में क्या रहा यहां मैं सदा भ्रान्त ?
जीवन में बढ़ता थकित-श्रान्त ?